తంజావుర ఆంధ్రనాయకరాజకాలనిర్ణయము :

ఇఁకఁ జెవ్వప్పనాయని రాజ్యకాలము కడపటి సంవత్సరము విక్రమ యని తంజావూరుజిల్లా కుంభకోణము తాలూకా కుంభకోణము గ్రామములోని శాసనమువలనఁ దెలియుచున్నది. ఈశాసనమున శాలివాహన శక వర్షము తెలుపఁబడలేదు. విక్రమకు[1] సరియగు శాలివాహన శకాబ్దము 1502 (క్రీ. శ. 1580).

---

1. Ep. coll., 292 of 1927. ఉత్తరార్కాడు జిల్లా వందవాసి తాలూకా కొడుంగలూరులో విక్రమ సంవత్సరమునాఁటి కృష్ణదేవరాయ మహారాయల శాసన మొకటి కలదు. రాయల కార్యకర్తయైన తిరుమలనాయకునికిఁ బుణ్యముగా దళవాయి చెవ్వప్పనాయకుఁడు చేసిన దానము నది తెలుపును. ఈ శాసనము కృష్ణదేవరాయల కాలమునాఁటిది గనుక ఈ విక్రమకు సరియైన శాలివాహనశకాబ్దము 1442. ఈ శాసనమునఁ బేర్కొనఁబడిన చెవ్వప్ప ప్రాయికముగా విజయనగరరాజ్య ప్రతినిధియైన తంజావూరి నాయకరాజు చినచెవ్వప్ప కావచ్చునని గౌర్నమెంటు శాసన శాఖవారు వ్రాసినారు (Ep. Rep., 1923-24, para. 44, page. 112). కాని వారి యీయూహ సరియైనదిగఁ గన్పట్టదు. చెవ్వప్పయను పే రున్నంత మాత్రమున నతఁడు తంజావూరి ప్రథమనాయకభూపతియగునని చెప్పలేము. చినచెవ్వప్పనాయకుని కడపటి సంవత్సరము విక్రమ యైనప్పుడు అతఁడంత కఱువది సంవత్సరములకుఁ బూర్వము వచ్చిన విక్రమనాఁటికే దళవాయిగ నుండెనన్న నప్పటికే యతనికి ఏ ముప్పది, ముప్పదియైదు సంవత్సరములైన నుండవలెను. దీనం జేసి మరణించునాఁటి కతనికి రమారమి వంద సంవత్సరము లుండవలెను. అంతకాల మతఁడు బ్రదికిన బ్రదుకవచ్చును కానియట్టి యూహ తగినంత ప్రమాణమున్నఁగాని సరియైన దనలేము. అదియునుగాక కృష్ణదేవరాయ మహారాయలకాలమునాఁటికే దళవాయిగ నుండినచో అచ్యుతదేవమహారాయల కాలమునాఁటి శాసనములలో నతనికి దళవాయిపద మెందువలనఁ జేర్పఁబడ లేదో. దుర్నిర్ణయము. దీని ననుసరించి కృష్ణదేవరాయ మహారాయల కాలమునాఁటి పూర్వోక్త శాసనమున వచ్చు దళవాయి చెవ్వప్ప తంజావురాంధ్రనాయక రాజయిన చినచెవ్వప్ప కాఁడనియే తోఁచుచున్నది.

పినచెవ్వప్ప నాయకుఁడు క్రీ. శ. 1580లోఁ జనిపోవుటకుఁ జాలకాలమునకుఁ బూర్వమే తనకుమారుఁ డచ్యుతప్పనాయకునికి యౌవరాజ్యాభిషేకము కావించెను. నాఁటినుంచి తంజావూరిరాజ్యము నుభయులును గలిసి పరిపాలించిరి. యువరాజయిననాఁటినుంచి అచ్యుతప్పనాయకుఁడే రాజ్యభారమును వహించి తండ్రి చెవ్వప్పనాయకునికి విశ్రాంతి యొసంగుచు వచ్చెను. చెవ్వప్పనాయకుఁడు నామమాత్రమేకాని యువరాజయిననాఁటినుండి యచ్యుతప్పనాయకుఁడే రాజు. ఈతని శాసములు క్రీ. శ. 1563 (శా. శ. 1485)నుంచి[1] కానవచ్చుటచేత ఇంచుమించుగ నాప్రాంతముననే యతఁడు యువరాజయ్యెనని యూహింపవచ్చును. తండ్రి మరణానంతర మీతఁడు తంజాపుర సింహాసనము నధిష్ఠించెను. అచ్యుతప్పనాయకుని కడపటి శాసనము శాలివాహన శకాబ్దము 1518, దుర్ముఖి, అనఁగా క్రీ. శ. 1596 వ సంవత్సరమునాటిది[2]. ఇతఁడు క్రీ. శ. 1600ల ప్రాంతమున మృతుఁడయ్యెనని జెసూట్ పాదిరీలు వ్రాసియున్నారు; కాని శ్రీకురుగంటి సీతారామయ్యగారును, శ్రీ. వి. వృద్ధగిరీశన్ గారును 1614 వ ప్రాంతమున స్వర్గస్థుఁడయినట్లూహించుచున్నారు. ఇతఁ డెప్పుడు కాలధర్మము నొందినను

---

1. అచ్యుతప్పనాయకుని మొట్టమొదటి శాసనము తంజావూరు జిల్లా నాగపట్నము తాలూకా తిరువారూరులోనిది. ఇం దీయఁబడిన శాలివాహన శకాబ్దము 1482; బార్హస్పత్యమానాబ్దము రుధిరోద్గారి. రుధిరోద్గారికి సరియైన శకవర్షము 1485 కాని 1482 కాదు. శాసనముల అంకెలు తప్పుగఁ బడుట తెలుచగుటచేత బార్హస్పత్యమానాబ్దమే సరియైనదని భావించి దానికి సరియగు శకాబ్దము 1485 నే గ్రహించితిని.

2. Ep. coll., 710 of 1904.

తాను మృతినొందుటకుఁ బూర్వమే తనతనయుఁడు రఘునాథ నాయకునికి యౌవరాజ్యపట్టము కట్టి రాజ్యభారము నతనిమీఁద మోపి తాను దైవచింతనమునఁ గాలము గడపెను. ఇందుకుఁ దార్కాణముగ రఘునాథనాయకుని మొట్టమొదటి శాసనము[1] అచ్యుతప్పనాయకుని రాజ్యకాలముననే క్రీ. శ. 1584లో ఉత్తరార్కాడుజిల్లా వందవాసి తాలూకాలోఁ గానవచ్చినది. విజయనగరాధీశ్వరుఁడయిన వేంకటపతిదేవ మహారాయలకు సాయముగఁ బోయి అతని రాజధాని పెనుగొండను ముట్టడించిన మహమ్మదీయులను దఱిమివైచి తంజావూరికి మరలి వచ్చినపిదప రఘునాథ నాయనికి పట్టాభిషేకము జరిగినట్లు మధురవాణి చెప్పుచున్నది. మహమ్మదీయులు వేంకటపతిదేవ మహారాయల కాలములో పెనుగొండను ముట్టడించుట క్రీ. శ. 1594-95 ప్రాంతమున జరిగినదని సయ్యదు మొహియుద్దీన్ కాదిరి జోర్ అను చరిత్రకారుఁడు తన సుల్తాను మహమ్మదు కూలి కుతుబుషా యనుగ్రంథమునఁ దెలిపియున్నాఁడు (పుట, 254). దీని ననుసరించి రఘునాథనాయకుఁడు

---

1. Ibid, 112 of 1924. గౌర్నమెంటు శాసనశాఖవారు ఈ శాసనము రఘునాథనాయకుని కుమారుఁడు విజయరాఘవనాయకుని దనిరి. ఈ శాసనమున బార్హస్పత్యమానాబ్దము తారణయే కాని శాలివాహన శకాబ్దము లేదు. నాయకభూపతి పేరు విజయరఘునాథనాయకుఁడని కలదు. విజయరాఘవ నాయకునికి విజయరఘునాథుఁడని పే రున్నట్లు తెలియరాదు. ఇతఁడు తొండమాన్ వంశజుఁడగునేమో, ఇది యింకను బరిశీలింపవలసిన విషయము. ఇటువంటి సందర్భములో నీ శాసనము విజయరాఘవునిదని శాసనశాఖవా రెందు కనిరో తెలియుటలేదు (Ep. Rep., 1924, para 64). తారణ సంవత్సరమునకు సరియైన శాలివాహన శకాబ్దము 1506 కును, 1566 కును సరిపోవును. 1566 తారణ అనఁగా క్రీ. శ. 1644 నాఁటికి రఘునాథనాయకుఁడు లేఁడు. అందువలన నిప్పటి కీశాసనము రఘునాథనాయకునిదిగనే గ్రహించితిని. నాయూహ సరియైనదగుచో ఇదే

తంజావూరి సింహాసన మెక్కుట క్రీ. శ. 1600ల ప్రాంతమున జరిగెనని నిశ్చయింపవచ్చును. ఇఁక రఘునాథుని నిధనకాలమును గుఱించి విచారింపవలసియున్నది. డచ్ (ఉలాందా) కంపెనీవారి 'డాగ్ బుక్' అను దైనిక వృత్తాంతసంగ్రహము అను పుస్తకమున క్రీ. శ. 1631, జనవరి 24 వ తేదిని తంజావూరి నాయకరాజు మృతినొందినట్లు కలదు.[1] ఈనాయకరాజు రఘునాథనాయకుఁడను

---

యాతని మొట్టమొదటి శాసనము.

1. P. 493. 1631 A. D., Jan. 24. Death of Naik of Tanjore after a reign of three years. He had put out the eyes of his elder brother from fear of his claiming the throne. A younger brother of 15 or 16 now succeeded (to the throne).

'డాగ్ బుక్' లోనిదాని కిది ఇంగ్లీషు తర్జుమా. పై వాక్యములు చాల సందిగ్ధములుగను, అస్పష్టముగను ఉన్నవి. అయినను వాటి నన్వయించుకొనుట అంత కష్టము కాదు. మూఁడు సంవత్సరము లన్నది ముప్పది సంవత్సరము లనుటకుఁ బొరపాటేమో. అట్లేయయిన రఘునాథనాయకుఁడు ముప్పదేండ్ల పరిపాలనమునకంతరమునఁ గాలధర్మము నొందెనని చెప్పవచ్చును. అట్లయినను నా వాక్యముల నీరీతి నన్వయించుకొనవలసియుండు నేమో; ఎట్లన, 1631 లోఁ జనిపోయినవాఁడు రఘునాథనాయకుఁడే. అగ్రసోదరుని కనులు పీకించినట్లు చెప్పఁబడినవాఁడు సింహాసనమునకు వచ్చిన 15, 16 సంవత్సరముల వయసుగల యాతని యనుజుఁడు. ముందు తెలుపఁబోవు రీతిని ఈతఁడు విజయరాఘవనాయకుఁడే. ఇతఁడు 1633 లో సింహాసన మెక్కినట్టు ముందు మనము తెలిసికొనఁగలము. అందువలన 1631, 1632, 1633 సంవత్సరములలో రఘునాథుని యగ్రసుతుఁడైన అచ్యుతనాయకుఁడును, యతని సోదరుఁడు విజయరాఘవుఁడును సింహాసనమునకై కలహించుచుండవచ్చును. రఘునాథ మరణానంతరము సింహాసనార్థము జరిగిన కుట్రఫలితముగఁ జివరకి 1633 లో, విజయరాఘవనాయకుఁడు గెలిచియుండును. కాని 1631-33 సంవత్సరముల నడుమ నచ్యుతనాయకుఁ డొకవేళ రాజ్యము చేయుచుండినను అది సింహాసన మెవరికిని స్థిరముగఁ జేపడని సోదర కలహకాలము. 'డాగ్ బుక్'ను విశ్వసించిన యెడల 1631 నుంచి విజయరాఘవ పట్టాభిషేక కాలము 1633 వఱకు నేర్పడు నెడమును క్రమ్మివేయుటకు పైని చెప్పిన మార్గముకాక మఱియొకటి లేదు.

టకు సందియము లేదు. ఇందుకుఁ దార్కాణముగ రఘునాథనాయకుని కట్టకడపటిశాసనము[1] శా. శ. 1553 ప్రజోత్పత్తి సంవత్సరమునాఁటిది కుంభకోణములోని సారంగమఠమునఁ గానవచ్చినది. రఘునాథుని కుమారులు మువ్వురు. వారిలో అగ్రతనూజుఁడు[2] అచ్యుతనాయకుఁడు; మిగిలినవారు అచ్యుతరామభద్ర,

---

1. Ep. coll., 290 of 1927. ఇందు బార్హస్పత్యమానాబ్దము ప్రజోత్పత్తికి సరియైనదనియిచ్చిన శాలివాహనశకవర్షము 1551. ప్రజోత్పత్తికి శకాబ్దము 1553 సరిపోవునుగాని 1551 సరిపోదు. అందువలన నీ శకాబ్దమే పైనీయఁబడెను. తంజావూరుజిల్లా కుంభకోణము తాలూకా పట్టీశ్వరములోని (నెం. 257 రు గల 1927-వ సంవత్సరపు) భావ సంవత్సరమునాఁటి శాసనము రఘునాథ నాయకుని కడపటి శాసనమని గౌర్నమెంటు శాసనశాఖవారును (Ep. Rep. 1927, para 95), వారి ననుసరించి వృద్ధగిరీశన్ గారును (The Nayaks of Tanjore, p. 125) వ్రాసినారు కాని యీవ్రాత దోషభూయిష్ఠమయినది. ఈ శాసనమున శా. శక మీయలేదు. భావకు సరియైన శా. శకాబ్దము 1556. అప్పటికి రఘునాథుఁడు లేఁడు. పట్టునూలుకారులకు సెట్లకు వివాహకార్యములలో నెవరు ముందు తాంబూలమును దీసికొనవలయునను విషయమున వచ్చిన వివాద పరిష్కారమును దెలుపుటకు పుట్టిన శాసన మిది. ఇందు దీక్షితస్వామియు, నాయకరయ్యయుఁ బేర్కొనఁబడిరి. ఈ పరిష్కారమునకు బద్ధులమని యుభయపక్షములవారును నాయకరయ్య (నాయకరాజు) పాదములు ముట్టి చేసిన శపథముతో నీ శాసన మంతమగుచున్నది. ఇందుఁ బేర్కొనఁబడిన దీక్షితస్వామి గోవింద దీక్షితులుకాని యాతని కొడుకు యజ్ఞనారాయణ దీక్షితులుకాని కావచ్చును. రఘునాథుని కాలముననేకాని విజయరాఘవుని కాలమునఁ దీక్షితస్వామి ప్రధానిగ నుండని కారణమున శాసనమునఁ బేర్కొనఁబడిన నాయకరయ్య రఘునాథుఁడని శాసనశాఖవారు నిర్ణయించిరి. ఈ వివాదము తీర్చుటకు గోవిందదీక్షితులు ప్రధానిగ నుండ నక్కఱలేదు. గోవిందదీక్షితులు పేర్కొనఁబడినంతమాత్రమున నాయకరయ్య రఘునాథుఁడును కానక్కఱలేదు. ఈ శాసనకాలమునాఁటికి తంజావూరి సింహాసనముననున్న నాయకరయ్య విజయరాఘవుఁడే.

2. విజయరాఘవుని యగ్రసోదరుఁడు తిరుక్కాట్టుపల్లి (తంజావూరి దగ్గఱిది), పందనల్లూరు (కుత్తాలమునొద్దది) గ్రామములతో సంతృప్తి పొందినట్లు The Maratha principality of Tanjore అన్న గ్రంథమును రచియించిన హికీ యనునాయన వ్రాసినారు. కాని వారు దీనికి ప్రమాణము చూపలేదు.

విజయరాఘవ నాయకులు. వీ రిరువురిలో నెవ రెవరికన్నఁ బెద్ద వారో తెలియదు. తండ్రిమరణానంతరమున న్యాయ్యముగా రాజ్యమునకు రావలసినవాఁడు రఘునాథనాయకుని యగ్రతనయుఁడు అచ్యుతనాయకుఁడు. ఇతఁడు సింహాసన మాక్రమించు కొను నను భయమున ఇతని యనుజుఁ డితని కనులు పీకించినట్లు పూర్వోక్తమయిన 'డాగ్ బుక్' లోఁ గలదు. ఈఘోరకార్యము చేసిన యనంతర మతఁడు తంజావూరి సింహాసన మధిష్ఠించెనట. ఇతఁడు రాజ్యమునకు వచ్చునాఁటికి 15, 16 సంవత్సరముల ప్రాయమువాఁడట. చివరి నాయకరాజు రఘునాథనాయకుని తనయుఁడైన విజయరాఘవ నాయకుఁడని నిశ్చయముగఁ దెలియుట చేత నితఁడే యన్నగారయిన యచ్యుతనాయకుని కనులు పీకించి సింహాసన మెక్కెనని చెప్పవచ్చును. రామభద్రనాయకుని వృత్తాంత మేమియుఁ దెలియదు.[1]

---

1. విజయరాఘవనాయకుఁ డచ్యుత, రామభద్రనాయకు లుభయుల కండ్లు పీకించి, వారిని వల్లంకోటలో బందీలుగ నుంచెనని, 1659 వ సంవత్సర ప్రాంతమున నచటికి వచ్చిన దండయాత్ర సందర్భమున వారు కారాగారమునుండి విముక్తులైరని జెసూటువృత్తాంతములవలనఁ దెలియుచున్నది. చూడుఁ డీక్రింది పంక్తులు:

"When the hour of peril was wrung, he (Vijayaraghava) had no more faith in his courage than in the fidelity of his subjects ; he sacrificed his dearest and fled to the forests......The latter (thieves), informed of the condition of the fortress, hurried to it in crowds, placed one of them as guard at the gateway and possessed themselves of these fabulous treasures which till then were not counted, but in measuring them by the bushel... In the confusion of this pillage, the prisons were thrown open and a multitude of state prisoners

రఘునాథనాయకాభ్యుదయరచనాకాలము :

విజయరాఘవనాయకుఁడు క్రీ. శ. 1633 లో తంజావూరి సింహాసన మెక్కెనని చెప్పుటకుఁ దగినంత యాధారము కలదు. మన 'రఘునాథనాయకాభ్యుదయము' లోని యీక్రింది

పట్టాభిషేకవైభవముఁ గైకొన్న
యట్టి సంవత్సరమం దొకనాఁట
నవలీలగాఁ బదియాఱు దానములు
సవరించి ద్విజుల కొసంగి.........

అనుద్విపద పంక్తులను (పుట, 12), చెంగల్వ కాళకవి కృతమైన విజయవిలాస నామాంతరమునం బరగు విజయ రాఘవవంశావళిలోని యీక్రింది

'శాలివాహనశకసంవత్సరములు వే
యేనూఱు నేఁబదియేను వరుసఁ
జనఁగ శ్రీముఖనామసంవత్సరంబున
శ్రావణ శుద్ధపక్షమున ద్వాద
శిని సౌమ్యవాసరంబున దక్షిణద్వార
కను గృష్ణతీర్థమందు నియమమున
స్నానంబుఁ గావించి సంకల్ప పూర్వంబు
గాను షోడశ మహాదానములను

were set free, the sole crime of most of whom being their fortune or social position. Among the latter were two brothers of the Nayak, whom he had shut up in these prisons, after pulling out their eyes to remove all desire on their side of succeeding him (the Nayak)—"History of the Nayaks of Madura, Appendix A, pp. 270-272 ff.

ఘనతమీఱఁ గళావతీ గర్భశుక్తి
ముక్తాఫలంబు రఘునాథమహిపసుతుఁడు
విజయరాఘవ మేదినీవిభుఁ డొసంగె
వేదవేదాంగవిదులైన విప్రులకును'

అను పద్యమును బరస్పరము నన్వయించుకొని చూచుచో విజయ రాఘవనాయకుఁడు షోడశమహాదానములను జేసినది రాజ్యమునకు వచ్చిన శా. శ. 1555 కు సరియైన శ్రీముఖ సంవత్సరమున నని తెలియుటచేత నాతని పట్టాభిషేక మాయేటనే, అనఁగా క్రీ. శ. 1633 లో జరిగినదనుట స్పష్టము. క్రీ. శ. 1673 (శా. శ. 1595) విజయరాఘవనాయకుని కడపటి రాజ్య వత్సర మనియే కాక తంజావూరిరాజ్య మంతరించిన వత్సర మనుటలోఁగూడ చరిత్రకారు లందఱు నేకాభిప్రాయులై యున్నారు. ఈ కారణమున రఘునాథనాయకాభ్యుదయము క్రీ. శ. 1633 - 1673 సంవత్సరములకు నడుమ, అనఁగా నిప్పటికి రమారమి మూఁడువందల సంవత్సరముల క్రిందటఁ బుట్టిన కావ్యము. దీని రచనాకాలము నింకను సూక్ష్మముగ నిర్ణయించుటకుఁ గొంత యవకాశమున్నది. రఘునాథనాయకాభ్యుదయములోని యీ క్రింది

"వీరుఁడౌ నవరము వేంకటపతిని
బాఱఁదోలించి నీ పనుపులచేతఁ
బట్టైన సీమలోఁ బందనల్లూరు
కట్టించితివి ఘటికామాత్రముననె
శ్రీరంగరాయలఁ జేపట్టి నిల్పి
యారాయ కార్యంబు లొఁగాదటంచు
దుండగించిన పాండ్య తుండీరపతుల
ఖండించి వాకిలిఁ గావఁ జేసితివి

అనుపంక్తులలో విజయరాఘవుని సాహస కార్యములు తెలుపఁబడినవి. 'రాయకార్యంబు లొంగాదటంచు' పాండ్య (మధుర), తుండీర (చెంజి) పతులు దుండగించిన శ్రీరంగరాయలు విజయరాఘవ నాయకునికి సమకాలికుఁడైన విజయనగరాధీశ్వరుఁడు; ఇతఁడు మూఁడవ వేంకటపతిదేవమహారాయుల మరణానంతరము క్రీ. శ. 1642 (శా. శ. 1564) లో రాజ్యమునకు వచ్చెను. సింహాసన మెక్కిన కొలఁది కాలములోనే శ్రీరంగరాయలు విజయనగర సింహాసనమునకుఁ దఱచుగాఁ గప్పము కట్టుట మాని విజయనగరాధికారమును ధిక్కరించి. తిరుగఁబాటు చేసి స్వతంత్రులగుటకుఁ బ్రయత్నించుచు వచ్చిన దక్షిణదేశ ప్రధాన విజయనగర నాయకసామంతుల నడుపులో నుంచి వారి వలనఁ దనకుఁ జెల్లవలసిన రాజగౌరవ మర్యాదాదులను దక్కఁ గొనుటకుఁ గొంత సైన్యమును దీసికొని దక్షిణదేశమున కరిగెను. ముఖ్యులైన తంజావూరు, మధుర, చెంజి నాయకరాజ సామంతులలోఁ దఱచుగా విజయనగర చక్రవర్తుల నెదిరించుచు స్వతంత్రులగుటకుఁ బ్రయత్నించుచువచ్చినవారు మధురనాయక రాజ్యాధిపతులు; విజయనగరమునకుఁ దఱచుగా మధురయవిధేయముగా నుండఁ దంజావూరు విధేయముగా నుండి పెక్కువిధముల సాయపడుచువచ్చెను. శ్రీరంగరాయల కాలమున మధుర రాజ్యాధిపతి తిరుమలనాయకుఁడు; చెంజిరాజ్యాధిపతి కృష్ణప్ప నాయకుఁడు. శ్రీరంగరాయలు దక్షిణదిశకెత్తివచ్చుచున్న వార్త విని తిరుమలనాయకుఁడు మిగిలిన యిరువురు నాయకులతోను మైత్రి నెఱపి, యందఱునుగలసి కర్ణాటాధీశ్వరు నెదిరించి యుద్ధము చేయుటకుఁ గట్టడిచేసెను. ఇఁక శ్రీరంగరాయలు సమీపమునకు వచ్చుచుండినతఱి తంజావూరి నాయకరాజయిన విజయరాఘవ

నాయకుఁడు మిత్రమండలినుండి విడవడి శ్రీరంగరాయల పక్షమునఁ జేరి మిగిలిన యిరువురు నాయకరాజులను ఓడించెను.[1] ఓడించి కర్ణాటాధీశుడైన శ్రీరంగరాయలకు సాయపడెను. పూర్వోక్తములైన ద్విపదపంక్తులు ఈ సందర్భమున విజయరాఘవనాయకుఁ డొనరించిన శౌర్యకృత్యములను దెలుపునవే. ఈ కారణముననే కావచ్చును, విజయరాఘవ నాయకునికి 'జీర్ణ కర్ణాటక సామ్రాజ్యసింహాసన స్థాపనాచార్య' బిరుదము కలదు. ఒకవేళ నిది రఘునాథ నాయకునివలననుండి సంక్రమించిన బిరుదమైనఁ గావచ్చును. పూర్వోక్తసంఘటన క్రీ. శ. 1643–44 ప్రాంతమున జరిగినది. అందువలన నీ రఘునాథ నాయకాభ్యుదయ కావ్యము ఆప్రాంతముననే, యాసంవత్సరముననో యంతకుఁ గొద్ది సంవత్సరములకుఁ దరువాతనో పుట్టియుండును.

విజయరాఘవుని యితరకృతులు : ఆశ్రితులైన యితర కవులు :

విజయరాఘవ నాయకుఁ డీద్విపద కావ్యమును, రఘునాథాభ్యుదయ నాటకమునే కాక ఇతరకృతులు మఱికొన్ని రచియించినట్టు

పదములు మంజరీప్రముఖకావ్యములు
మొదల మాకంకితంబులు చేసితీవు

అనుకృత్యాది ద్విపదచరణములవలనను

కమనీయరుక్మిణీ కల్యాణముఖ్య
సమధికనాటక సంవిధాయకుఁడు
మహనీయ పదపద్యమంజరీముఖ్య
బహుళప్రబంధ నిబంధనశాలి

1. History of the Nayaks of Madura, p. 137,
C

యను నాశ్వాసాంత్య ద్విపదపంక్తులవలనను దెలియుచున్నది. ఇతఁడు రచియించిన కృతులు సవిస్తరముగ నేతత్కవి విరచితమైన ప్రహ్లాదచరిత్రమను యక్షగాన రూపకమునఁ గల యీక్రింది సీసమాలికలోఁ బేర్కొనఁబడినవి.

" శ్రీలొంద రాజగోపాలవిలాసనా
టకము సందర్భించు సుకవివంద్య
మధురోక్తులను జెంగమలవల్లి పరిణయం
బానతిచ్చిన ప్రతిభానిధాన
కోవిదుల్ గొనియాడ గోవర్ధనోద్ధర
ణము రచించిన కల్పనాధురీణ
రతిమన్మథవిలాసకృతిరాజ మొనరించి
పరగు ప్రాబంధిక పట్టభద్ర
భువిని రాసక్రీడ నవనీతచోరంబు
వావణించి వెలయుమహానుభావ
చాతురిచేఁ బారిజాతాపహరణంబు
రచనచేసిన మృదువచనధుర్య
ఘనమైన రుక్మిణీకల్యాణ మనుకృతి
నిర్వహించిన బుధసార్వభౌమ
పరుస రాధామాధవవివాదము ధనాభి
రామం బొనర్చుసర్వజ్ఞతిలక
పాండిత్యమున సత్యభామావివాహ వ
ర్ణన యొనర్చిన కవిరాజరాజ
ప్రాజ్ఞు లౌనన నుషాపరిణయనాటకం
బమరఁజేసిన శారదావతార

దక్షిణద్వారకా స్థలవర్ణనాభాగ
ముద్ధరించిన సుప్రసిద్ధచరిత
మహిమచేఁ గాళియమర్దనం బొనరించు
సరిలేని రాజుల చక్రవర్తి
ధర రఘునాథాభ్యుదయము నాటకముగా
ద్విపదగా రచియించు ధీరవర్య
యల మోహినీవిలాసాఖ్యద్విపదకృతి
నాటకం బొనరించు నలసమాన
యతిపవిత్రంబు ప్రహ్లాదచరిత్రంబు
నవరించు ఘనమసీషాధురీణ
హారువునఁ బూతనాహారణంబ నెడునాట
కం బొనరించు శృంగారలోల
తగు మంజరీద్విపద ప్రబంధము నాట
కంబుగా హవణించు గానచతుర
విప్రనారాయణ విద్వత్కథాసంవి
ధానం బొనర్చిన ధీనిధాన
బుధులు మెచ్చ సముద్రమథననాటకరాజ
మొనరించు భువనమోహనచరిత్ర
లలితమౌ కృష్ణవిలాసనాటకమణి
నల్పిన యష్టభాషాధురీణ
ఘనతరంబగు పాదుకాసహస్రం బెల్ల
ద్విపదఁజేయు కళావతీ తనూజ
రసికులు ప్రణుతింపఁ బ్రణయకలహమను
కృతియొనర్చిన చమత్కృతిధురీణ

యతులితప్రౌఢిచే నల కంసవిజయంబు
ఘటియించు భువనవిఖ్యాతశీల
ఘనమైన జానకీ కల్యాణనాటకం
బమరించు వావదూకాగ్రగణ్య
నవపుణ్యకవ్రతనాటకవైఖరి
సేకరించిన వాగ్విశేషశేష
కేళిమై గోపికాగీతలు భ్రమరగీ
తలు తెనింగించునద్భుతసభాజ్య
సరిలేని ఫాల్గుణోత్సవమెల్ల రగడ చౌ
పదము లొనర్చిన భవ్యచరిత
ధర రాజగోపాలదండకసందర్భ
వైదర్భిఁ గన్న విద్వత్కవీంద్ర
సారమా వీరశృంగారసాంగత్యంబు
మెఱయించు రసికులమేలుబంతి
సంపంగిమన్నారు సాంగత్యము నమర్చి
జగతి నెచ్చిన నెఱజాణరాయ
గోపాలునకు వేడుకోలు విన్నపములు
దరువు లొనర్చు నౌదార్యధుర్య
యేలలు విడిపదాల్ హెచ్చుసంకీర్తన
లధ్యాత్మ లొనరించు నతులచర్య...
.................................

మహితగాంభీర్య చోళసామ్రాజ్యధుర్య
కోటిమన్మథరూప సద్గుణకలాప
విక్రమకుమార రఘునాథవిభుకుమార
ధ్రువముగా మను విజయరాఘవనృపాల !"

ఈపై సీసమాలికలోని కావ్యభేద గీతభేదాదులను గమనించినచో విజయరాఘవనృపాలుఁడు ఒక్క ద్విపద కావ్యరచనమున మాత్రమే కాక తదితర సాహిత్య రచనలలోఁగూడఁ జాల సమర్థుఁడనియు, నానాఁటి మేటి కవులలో నీతఁడొక్కఁడనియుఁ దోఁపకపోదు. అష్టభాషాధురీణుఁడట యితఁడు ; గోపికాగీతలు, భ్రమరగీతలు తెనిఁగించెనట. ఈతఁడు రచియించిన పదములు, పాటలు, నాటకములు, ద్విపదలు, దండకములు, సంకీర్తనములు మొదలగు పైని చెప్పిన వన్నియు నిపుడు కానవచ్చుట లేదు. కాళీయమర్దనము, ప్రహ్లాదచరిత్రము, పూతనాహరణము, విప్ర నారాయణచరిత్రము అనునాటకములుమాత్ర మున్నవి. ఈనాట కముల నన్నిటిని బ్రకటించుట మేలు. ఈ నాటకము లన్నిటిలోను గానవచ్చు మొట్టమొదటి పద్యము మన రఘునాథాభ్యుదయము నందలి యీక్రింది సీసపద్యమే.

భోజకన్యాముఖాంభోజరాజమరాళ
    సత్యాఘన స్తన స్తబకభృంగ
జాంబవతీవిలోచనచకోరశశాంక
    మిత్రవిందాతటిన్మేఘరూప
భద్రావశావశాభద్రదదంతావళ
    వరసుదంతామనోవనమృగేంద్ర
లక్షణారూపకలాపిపర్జన్య
    భానుసుతాలతాపారిజాత

    షోడశస్త్రీసహస్రచక్షుఃప్రసార
    హారసారమసారమోహనశరీర
    విజయరాఘవభూపాలభజనలోల
    కేలు మోడ్చెద రాజగోపాల నీకు.

ప్రాయికముగా విజయరాఘవనాయకుని యితర నాటకములలో సైతము ప్రారంభమున నీపద్యమే యుండునేమో ; అట్లయిన నీతని నాటకములను గుర్తించుట కది సాధనము కాఁదగును. మిగిలిన నాటకాదులు తంజావూరి సరస్వతీభాండాగారమున నున్నవో లేవో, యున్నచో నవి గుర్తింపఁగూడదరనివో తెలియ రాదు. ఎట్లయినను మిగిలినవి కానరానివిగనే పరిగణించుట యుక్తము. విజయరాఘవనాయకుఁ డష్టభాషాధురీణుఁడు మాత్ర మే కాదు ; చతుర్విధకవితానిర్వాహకసార్వభౌమబిరుదాంగదవి రాజమానచరణాంభోజుఁడుకూడను. అందువలననే చెంగల్వకాళ కవి తన రాజగోపాలవిలాసమున విజయరాఘవ వంశావళిలో సీసమునందలి యెత్తుగీతమున

"వినతరాజన్యకోటీర వివిధరత్న
సమితి యీరీతి నుపచారసరణిఁ గూర్చ
విజయరాఘవమేదినీవిభుని యంఘ్రి
నౌర సాహిత్యరాయపెండార మమరు"

అని వర్ణించియున్నాఁడు. విజయరాఘవమేదినీశుని సాహిత్య రాయ పెండారమును, అతని సభలోని శారదాధ్వజమును అభి వర్ణించుచుఁ గాళకవి వ్రాసిన సీసపద్యములు పెక్కులు గలవు. వానిలో మచ్చున క్రింది పద్యమును జూడుఁడు.

"ఒక్కొక్కయెడఁ జీనిచక్కెరపానకం
బానిన ట్లాహ్లాద మావహిల్ల
ఒక్కొక్కయెడఁ దావి నెక్కొన విరవాది
సరము లెత్తినరీతిఁ బరిమళింప

ఒక్కొక్కయెడఁ జవు లుప్పతిల్లఁగ మంద
  మారుతంబులు వీచుమహిమ చెలఁగ
ఒక్కొక్కయెడ మేనఁ జొక్కుసంపాదించు
  వెలఁదివెన్నెలతేటవిధము మించఁ

గవిత రచియింప విజయరాఘవవిభుండె
నేర్పునని వాణి నర్తించు నేర్పు మెఱయఁ
జామరానిలకందళీచలిత మగుచుఁ
దనరు సభలోన నల శారదాధ్వజంబు."

విజయరాఘవనాయకుని కాలమున తంజావూరి రాజుల కొలువు కూటము నిజముగాఁ గనులపండువు సేయు శారదానాట్యమందిరమే. సంగీత నాట్యములలో నయితము విజయరాఘవుని దండె వేసిన చేయి; 'అతఁడు నవరసికుల కెల్ల నాయకుఁడు'. అతని కొలువుకూటము ననేకులు సంగీత సాహిత్య విశారదలైన సారంగలోచన లలంకరించువారు. వారిలోఁ జంద్రరేఖ, కృష్ణాజమ్మ, రంగాజమ్మ మొదలైనవారు ప్రథమగణ్యులు.

"తీఁగమెఱుంగులతీరున నిరుగడ
  వరుస బంగారు పావడలు మెఱయఁ
బఱపుగా వలగొన్న భానుమండలముల
  హరువున నపరంజి హారిగ(గె) లమర
మొగులు మొత్తంబులు మోహరించిన రీతిఁ
  బమ్ముసాంబ్రాణి ధూపమ్ము లలర
విద్యావిశేషముల్ వేర్వేర హవణించు
  హావణిక బిరుదవాద్యములు మొఱయ

వీరవేంకటరాయ పృథ్వీమహేంద్ర
దత్తబహువిధబిరుదముల్ దనరుచుండ
సముఖమున నిల్చి యాముద్దుచంద్రరేఖ
వివిధవిద్యల వినిపించె వింత యనఁగ."

ఈ చంద్రరేఖ కర్ణాటాధీశుఁడును క్రీ. శ. 1642 వఱకుఁ బరిపాలనము నెఱపినవాఁడునైన మూఁడవ వేంకటపతి దేవరాయలను దన విద్యచే మెప్పించి బహువిధబిరుదములను గైకొన్న చతుర. ఈమె కొలువుకూటమునకు బిరుదవాద్యవిరాజమానయై యరుగుదెంచెడిదట. ఇఁకఁ గృష్ణాజమ్మకూడఁ జంద్రరేఖకుఁ దీసిపోయినది కాదు. ఆమె సాహితీవిద్యాధరి. చూడుఁ డామె ప్రజ్ఞ యెట్టిదో:

"ప్రస్తారసంఖ్యను బదుమూఁడు కోటులు
నలువది రెండులక్షల పదేడు
వేలు నేన్నూరును వింశతియును నాలు
వృత్తంబులందు నీ వృత్తమునకు
నీవర్ణనసమస్య నీవు గూర్పు మటన్న
నావృత్తమున సమస్యను రచించి
యందుకు శ్లోకంబు లాశువుగాఁ జెప్పి
యవి తెనుంగునను బద్యములు సేసి
యిరువదాఱును ఛందంబు లెఱిఁగి యట్లు
కవిత చెప్పినవారు లోకమునఁ గలరె
యనుచు వినుతింప వినిపించి ఘనతఁ గాంచెఁ
గీర్తనీయగుణాలంబ కృష్ణమాంబ."

విజయరాఘవ నాయనయ్యవారు తన్ను సంబోధించి యాక్రిందిరీతిని బల్కినట్లు చెంగల్వ కాళకవి తన రాజగోపాల విలాసమున నిట్లు తెలిపినాఁడు:

అయ్యదినముల రామభద్రమ్మవారు
నేఁడు కృష్ణాజి కవితల నేర్పు మెఱయ
వినికిసేయుట లెల్ల మోఘనత గాదె
కవివినుతచర్య! చెంగల్వ కాళనార్య!

రఘునాథ నాయనయ్యవారి కాలమున రామభద్రాంబ వలెనే విజయరాఘవ నాయనయ్యవారి కాలమునఁ గృష్ణమాంబ కవితల నేర్పు మెఱసినదట. ఈమె చెంగల్వ కాళకవియొద్దనే విద్య నేర్చియుండును. పైనుడివిన యిరువురివలెనే రంగాజమ్మయు సరసకవితారచన నసమాన ప్రజ్ఞాధురీణ. ఈమె మన్నారుదాస విలాస మనుపేరఁ బ్రబంధమును యక్షగాన రూపకమును, ఉషా పరిణయమను ప్రబంధమునేకాక భారత, భాగవత, రామాయణ ములనుగూడ రచియించినట్లు ఉషా పరిణయములోని కృత్యాది యందలి యీ క్రింది పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది :

" వేంకటేంద్రుని పుత్రి వినుత సద్గుణధాత్రి
ఘనయశోరాజి రంగాజి వినుము
మాధుర్యమున మించు మన్నారుదాసవి
లాసప్రబంధంబు లలిత ఫణితిఁ
గావించి మిగుల శృంగారంబు గన్పట్టఁ
బదములు మృదురసాస్పదము లగుచు
రాణింప రచియించి రామాయణంబును
భాగవతంబును భారతంబు

సంగ్రహమ్మున రచియించి సరసరీతి
మమ్ము మెప్పించితివి చాల నెమ్మిఁ దనరఁ

బరగ హరివంశమున నుషా పరిణయకథ
తెనుఁగుగావింపు మిఁక నీవు తేటగాఁగ."

ఇట్లు కోరిన విజయరాఘవుని కోరిక మీఁద నే యామె యుషా పరిణయ ప్రబంధమును నిబంధించెను. విజయరాఘవ నాయకునికి రంగాజమ్మ యనినఁ బ్రత్యేకాభిమానమో లేక యాతని కొలువు కూటమునందలి సాహిత్య సరస్వతు లందఱిలో నీమె మిన్నయో, విజయరాఘవ వసుమతీంద్రుఁ డీమెకుఁ గనకాభిషేకము కావించెనట. చూడుఁ డీమె రచియించిన యుషాపరిణయమునందలి యాశ్వాసాంత గద్యము :

"ఇది శ్రీమద్రాజగోపాల కరుణాకటాక్ష వీక్షణానుక్షణ ప్రవర్ధమాన సారస్వతధురీణయు, విచిత్రతర పత్రికా శతలిఖిత వాచికార్థావగాహన ప్రవీణయు, తత్ప్రతిపత్రికా శతస్వహస్త లేఖన ప్రశస్తకీర్తియు, శృంగారరస తరంగిత పదకవిత్వ మహనీయ మతిస్ఫూర్తియు, అతులితాష్టభాషావితాసర్వాంకవమనీషా విశేషవిశారదయు, రాజనీతివిద్యావిశారదయు, విజయరాఘవ మహీపాల విరచిత కనకాభిషేకయు, విద్వత్కవి జన స్తవనీయ వివేకయు, మన్నారుదాస విలాసనామ మహాప్రబంధ నిబంధన కృతలక్షణయు, మహనీయ రామాయణ భాగవత భారతకథా సంగ్రహావిచక్షణయు, పసుపులేటి వేంకటాద్రి బహుజన్మతపః ఫలంబును, మంగమాంబా గర్భశుక్తి ముక్తాఫలంబును, రంగద్గుణ కదంబయునగు రంగాజమ్మ......"

ఎల్లప్పుడు నీగణికలతో నానందించు విజయరాఘవ నృపాలుని మహిషి తనకోపము నాపుకొనఁజాలక యావారాంగనకు

దూషణోక్తులలోఁ నొకదూతిక మూలమునఁ గబురంపె ననియు, విదుషీమణియగు నావారాంగన యాదూతి కీ పద్యమును జెప్పి పంపె ననియుఁ జెప్పుదురు.

> "ఏవనితల్ మముం దలఁప నేమిపనో? తమ రాడువారు గా
> రో? వలపించు నే ర్పెఱుఁగరో? తమకౌఁగిటిలోన నుండగా
> రా వదియేమిరా విజయరాఘవ యం చిలుదూరి బల్మిచేఁ
> దీవరకత్తెనై పెనఁగి తీసుకవచ్చితినా తలోదరీ?"

ఈవారాంగన రంగాజీయే యని నానుడి. ఈపై పద్యము నేకాక కీర్తిశేషులైన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు విజయ రాఘవునిమీఁది యీక్రింది చాటువులనుగూడ సేకరించి తమ చాటుపద్యమణిమంజరిలోఁ బ్రకటించియున్నారు.

రాజనిభాననా! సరసురాలవు జబ్బుగ నల్లినా వదే
మే జడ? యింతకంటె వలెనే? వల నొప్ప బిగించి యల్లవే
రోజవరాల! వేఱె పని యున్నది; దోసమె దోసమే మహా
రాజగునట్టి యవ్విజయరాఘవు మైచిగురాకె కోమలీ!"

"కలికెద వేటికే చెలియ? కుంచెఁడు మానెఁడుగాను నెల్లవా
రలు వినినారులే; విజయరాఘవ రాయఁడు నిన్నుఁగూడుటల్
వలపులె చాటుచున్నవి జవాదియు నల్లవు విట్టపీఁగఁగా
వలెనటె, చూచి యోర్తురటె వంతులుజంతుల వేటియెమ్మెలే?"

"ఇంతీ! పానుపుపై నిదె
కంతుఁడు గూర్చున్నవాఁడు కనుఁగొను మహహా!
కంతుఁ డనంగుఁడు నీ తెలి
వింతేనా, విజయరాఘవేంద్రుఁడె చెలియా!"

ఈ పద్యములును వారాంగనా విరచితములే కాఁదగును.

విజయరాఘవ నాయనయ్యవారి సభలో నాట్యవిద్యా వైదుష్యమును బ్రదర్శించిన నట్టువరాండ్రు కొందఱు కాళకవి విరచిత రాజగోపాల విలాసమువలనఁ దెలియవచ్చుచున్నారు. వీ రందఱును నాట్యాభినయములఁ జతురలే. ఈక్రింది పద్యము నరయుఁడు :

"చాపదకేళిక రూపవతీకాంత
......చూడామణి చంద్రరేఖ
చెలువగు జక్కిణిఁ జెలువ మూర్తివధూటి
(?)కొరముఁ గోమలవల్లి గురునితంబ
నవపదంబులు లోకనాయికా లోలాక్షి
యల దేశి శశిరేఖకాబ్జవదన
దురుపదంబులు రత్నగిరినితంబినియును
బేరణివిధము భాగీరథియును

మదనబలిదూత్య నవరత్న మాలికాది
బహువిధాలక్ష్యనాట్యప్రపంచమెల్ల
ఘనత విలసిల్లఁ దక్కిన కాంతలెల్ల
నభినయించిరి తమ నేర్పు లతిశయిల్ల."

పై పద్యమునఁ దెల్పిన పేరులు కల్పితములు కావనియే నాయూహ. వీ రందఱు నాఁనాడు విజయరాఘవుని యాస్థానము నలంకరించిన వారలే. వీరిలోఁ గొందఱు రఘునాథనాయకాభ్యుదయమునందలి యీక్రింది పంక్తులలోఁ బేర్కొనఁబడినారు.

బిరుదుపాత్రలు విజృంభించి యారాజ
వరునిముందఱ నిల్వ వారిలోపలను

బదచాళిఁగొనియె రూపవతీవధూటి
కొదలేక పేరణిఁగొనె చంద్రరేఖ
మిక్కిలికోపుల మెఱవడిఁ జూపి
జక్కిణి వినిపించె శశిరేఖ యపుడు
ననఁబోఁడి యగులోకనాయికాకాంత
వనజలోచన కీరవాణి లతాంగి
దురపదకేళిక దురుసైనకోపు
వరుస నటించిరి వన్నెమీఱఁగను
కొరవంజి శివలీల గుజరాతి దేశి
విరిబోండ్లు కొందఱు వినిపించి రపుడు (పుట21)

చొపదకేళి, జక్కిణి, కొరము (కొరవంజి?), నవపదంబులు, దేశి, దురుపదంబులు, పేరణి, మదనబలదూత్యము మొదలైనవి నాట్యబంధములు. విజయరాఘవ మహీజాని

" వాల్వేచి (?) గుజ్జరి విల్వేడు (?) దండలా
స్యము కందుకక్రీడ యల్లికయును
గొరవంజి శుభలీల గుజరాతి దేశి చొ
పదము జక్కిణి దురుపదము మదన
పద (? బల)దౌత్యమును జోగి(?గు) పదచాళి శారదా
సామ్రాజ్యమును జిందు సవతిమచ్చ
రంబులు నాట్యకదంబంబు మొదలైన
నాట్యముల్ పావణిం" చిన

నాట్యకలా పిశారదుఁడు. ఈ నాట్యభేదములలోఁ బేరణి గుజరాతి దేశి జక్కిణి దండలాస్యము (దండలాసకము) కందుకక్రీడ

చిందు మొదలైనవి చాలఁ బూర్వకాలమునుంచియు వచ్చుచున్నవే.

“ మహోత్సవ మండపమునం దుఁ బేరోలగం బుండి
కుండలీ దండలాసక ప్రేరణీ ప్రేంకణ సింధు
కందుక ధమాళి చేల మత్తల్లీ హల్లీసకాదినృ
త్యంబు లవలోకించుచు ” అని భీమఖండము.

శబ్దపదంబులు, నవపదంబులు, మరుపదంబులు అనునవి చారికా కరణాంగహార రేచకముల భ్రమరికావళుల సర్తనగతులు. వాల్ప్వచి, విల్వేడు, కొరము అనునవి సరియైన పదము లగునో కావో, యవి యెట్టి నాట్యవిశేషములో మనకుఁ దెలియరాదు. పూర్వోక్తసీసపాదములలోఁ జెప్పిన నాట్యబంధములలోఁ గొన్ని విజయరాఘవనాయకోపజ్ఞములు నుండవచ్చును.

విజయరాఘవ నాయకుఁడు ‘ కవిసమాజభోజభూజాని ’. సరసకవితాచాతురీ ధురీణలయిన గణికావతంసలే కాదు, విజయరాఘవుని యాస్థానమున సంగీత సాహిత్య విశారదులైన కవిశ్రేష్ఠులు నుండిరి. ఇందఱు కవులకును గవయిత్రులకును గాయన గాయనీ మణులకును ఆశ్రయమిచ్చి వారిని బోషించి వారితో సంగీత సాహిత్య నాట్య విద్యావినోదముల నానందించుచు వచ్చిన విజయరాఘవ భూవరుఁడు ఇతర విషయముల నెట్టివాఁడైన నీ విషయమునఁ బ్రసుతిపాత్రుఁడు కదా ! రఘునాథ నాయకుని కాలములోకంటెను అతని తనయుఁడు విజయరాఘవుని కాలముననే సంగీత నాట్యకళ లభివృద్ధిచెంది ఆంధ్రసాహిత్యమునకు సరిక్రొత్త మాధుర్యమును, సౌరభమును జేకూర్చినవి. తంజా

పురాంధ్ర నగరమున విజయరాఘవ భూపాల లాలితమైన యాంధ్రసాహితీకన్య వీణాగాన విలోలమై గొంతు విప్పి మధుర గానము సేయుచుఁ జిందులు త్రొక్కి నృత్యము చేసినది. ఆకాలమున నందఱును గానకళాలోలురే, వీణాగానప్రియులే, నాట్యకళా చతురులే, యక్షగానరూపక కవితా సంపన్నులే.

విజయరాఘవుని యాస్థానమున యక్షగానరచనలను సంతరించిన కవిప్రకాండు లింకను ననేకు లుండిరి. అట్టివారిలోఁ గామరసు వేంకటపతి సోమయాజి ' విజయరాఘవ పట్టభద్రుని పట్టంపుఁగవి ' యట. కోనేటిదీక్షితనామధేయుఁడుకూడ సామాన్యుఁడు కాఁడు. ఇతఁడు " విజయరాఘవభూపాల కృపాపాంగ వీక్షణానుక్షణ ప్రాప్త సారాగ్రహారుఁడు" ; "తారహారరుచిరత్న రత్నకంకణోదార తారానురూపముక్తాకలాపహృద్యతర బిరుదవాద్యనానావాహనాది సన్మానమాననీయ శాశ్వతైశ్వర్యధుర్యం" డట; " బహువార రచిత యాగభాగ సంతర్పితాఖిల దేవతావర్యం "డట ; " సంగీతసాహిత్య విద్యాధురీణ వరేణ్యం "డట ; అంతియ కాదు "గురురాజ శతక్రతు శ్రీనివాసదేశిక ప్రతిష్ఠాపితోపాధ్యాయ వైభవధుర్యం" డట. సంగీత సాహిత్యములు కలసి నర్తించిన కాంచనకాల మది, శారదా సామ్రాజ్యోత్సవమే నాఁటిది. ఆ యుత్సవమున యక్షగాన రూపకమునకే ప్రథమ గౌరవము. అందువలన సంగీత సాహిత్యములు నేర్చిన యెల్లరు నట్టి రూపకములు రచియించిన జాణలే. పై నుడివిన వా రందఱును యక్షగాన రూపకములు రచియించినవారలే. విజయరాఘవ నాయకుఁడు రఘునాథ నాయకాభ్యుదయమును రచియించినట్లే కోనేటి దీక్షితులు విజయరాఘవ కల్యాణమును విరచించెను. కామరసు వేంకటపతి సోమయాజి విజయరాఘవ

నాయక చంద్రుని చంద్రికావిహార శృంగార లీలావిలాసమును 'విజయరాఘవ చంద్రికా విలాస' మను పేర హావణించెను. పురుషోత్తమ దీక్షితుఁడు 'తంజాపురాన్నదాన మహానాటకము 'ను రచించెను. విజయరాఘవనాయుని కాలములోఁ దంజాపురమున మహారాజ సత్రములోఁ బ్రతిదినమును వేలకొలఁది బ్రాహ్మణులకు మృష్టాన్నప్రదానము సేయువారట. విజయరాఘవ నాయకునికి "ప్రతిదిన బ్రాహ్మణ సహస్రాభీష్ట మృష్టాన్నదాన దీక్షాధురీణుఁ" డను బిరుద ముండెను. పురుషోత్తమదీక్షితుఁడు "విశిష్ట దేశికాభీష్ట దేవతారూపుండైన శ్రీనివాసస్వామిని నిజమానస నివాసునిం జేసి శృంగార హాస్యాద్భుతరసప్రధానంబుగా" నీ "తంజాపురాన్నదాన నామక మహానాటకమును" హావణించెను విజయరాఘవ నాయకుని తనూజుఁడు మన్నారుదేవుఁడు కూడ సంగీత సాహిత్యములఁ జతురుఁడే. ఈతఁడు 'హేమాబ్జ నాయికా స్వయంవర' మని యొక రూపకమును రచించెను. ఈ యక్షగాన రూపకమునందలి కట్టకడపటిగద్య మిట్లున్నది.

"ఇవ్విధంబునఁ బినచెవ్వయాచ్యుతాధిపప్రపౌత్రుండును, రఘునాథ జననాథ పౌత్రుండును, విజయరాఘవ భూపాలక ప్రియ పుత్రుండును, రాజగోపాలాంబికా గర్భ కలశజలధి కువలయ మిత్రుండును, అతుల కనకతులా ప్రముఖ నిఖిలమహాదాన దీక్షాధురీణుండును, అనేకాగ్రహార ప్రతిష్ఠాపన ప్రవీణుండును, విజయరాఘవాభ్యుదయాది ప్రబంధ నిబంధన చాతురీ ధౌరేయుండును, అతులిత పితృభక్తిభాగధేయుండును మహితానుభావుండునగు మన్నారుదేవుండు..."

ఈ పైగద్యము ననుసరించి యీ మన్నారుదేవుఁడు 'హేమాబ్జ

నాయికాస్వయంవరము ’ నేకాక విజయరాఘవాభ్యుదయాది ప్రబంధములను మఱికొన్నిటిని నిబంధించినట్లును దెలియనగు చున్నది. కాని యా ప్రబంధము లీవఱకుఁ గానరాలేదు. ఇఁక రఘునాథనాయకాభ్యుదయ కావ్యప శేషములనుగుఱించి విచారిం తము.

కావ్యగౌరవ విశేషములు :

రాజ్యము పాలించుచుండిన కాలమున నుదయమున నిద్ర లేచినదిమొదలు రాత్రి పరుండఁబోవువఱకు రఘునాథనాయకుని యొకనాఁటి వృత్త మీ కావ్యమునందలి యితివృత్తము. ఆంధ్ర నాయకరాజుల కాలమున రాజజీవిత మెట్లుండెనో తెలిసికొనుట కీకావ్యము దర్పణమువంటిది. ఆనాఁటి నాయకరాజులు ధరించు వేషభూషలు, చేయు నాహార విహారములు, గడవు విద్యావినోద ములు, పరిశీలించు రాజకార్య కలాపములు – ఇది యది యననేల అన్నియు నిందు సవిస్తరముగ వర్ణితములైనవి. ఆంధ్రనాయకరాజ రాజకీయ జీవితము కర్ణాటాధీశ్వర రాయజీవితమునకుఁ బ్రతిబింబ మే.దానినిమనకుఁ జక్కఁగాఁ జిత్రించి చూపునదగుటచేత నీకావ్య మమూల్యమయినది. రాయవాచకము తప్ప ఆనాఁటి యాంధ్ర రాజదైనిక జీవితము నింత ప్రస్ఫుటముగఁ గన్నులకుఁ గట్టినట్లు చూపున దీరఘునాథనాయకాభ్యుదయమే కాని మఱియొకటి కానరాదు. ఇందే దీనిగౌరవము కలదు. రఘునాథనాయకుని దేవ భూదేవ పూజనము, దానాదికములు, మజ్జనభోజనాదులు, కొలు వుకూటము విశేషములు, విద్యావినోదములు, పురవీథుల విహార యాత్ర, యారామ విహారము మొదలైనవాని వర్ణనములను జదువునప్పుడు మన మాకాలమున నున్నట్లే యా విశేషములను

మనము సందర్శించుచున్నట్లే తోఁచును. కవి కావ్యము నంత వాస్తవికముగఁ దీర్చి దిద్దియున్నాఁడు. ఈ కావ్యమున రఘునాథుఁడే నాయకుఁడు. పురవీథుల స్వారి వెడలుచుండినతఱి జాల మార్గమున నొకపౌర సుందరి చిత్రరేఖ రఘునాథ నాయకుని జూచి యాతనిని వలచి మరుబాఱికి లోనయి విరహానల సంతప్త యగును. ఈ సుందరియే నాయిక. ఆమెచెలికత్తె లామె మన్మథ సంతాపభరమును వాపుట కామె నుద్యాన వనమునకుఁ గొని పోయి శైత్యోపచారములు చేసి, దానివలనఁ గార్యముఁ గానక మన్మథపూజ చేయింతురు. దానివలనఁగూడ నామె కంతుసంతాపము శాంతింపదు. అప్పు డా సుందరియొద్ద నామె పెంచుచుండిన యొకకీరము రాఁగాఁ నామె దానికిఁ దనవృత్తాంత మంతయుఁ దెలియఁజెప్పి రఘునాథునిఁ దోడితెమ్మని దాని నాతనికడకు రాయబార మంపును. రఘునాథుఁ డారామసీమను విహరించుచుండిన సమయమున నాతనిం జేరనరిగి శుకము తన సందేశమును వినిపించి తన దూతకృత్యమును నెఱవేర్చి నాయికా నాయకులకుఁ బొత్తు కుదుర్చును. వా రుభయుల సమాగమ సౌఖ్యము తోఁ గావ్య మంతమగును. ఈ విధమైన కథావిధానమును దీసికొని కవి సందర్భోచితముగ పురవర్ణనము, మన్మథోపాలంభము మొదలైన గావ్యలక్షణముల నమరించెను. మూఁడాశ్వాసముల కావ్య మిది. రఘునాథుఁడు పురవీథుల స్వారి వెడలినప్పటివఱకుఁ గలవృత్తము ప్రథమాశ్వాసమునను, స్వారివెడలుట మొదలు శుకదూత్యము వఱకుఁగల కథ ద్వితీయాశ్వాసమునను, రఘునాథనాయకుని మధ్యాహ్న భోజనాదిక వృత్తవిశేషములు, శుకదౌత్యము, నాయకీనాయక సమాగమము మొదలైనవి తృతీయాశ్వాసమునను నభివర్ణితము లైనవి. రఘునాథనాయకాభ్యుదయమునఁ

ద్వితీయాశ్వాస మాశ్వాసాంత్య ద్విపదచరణములు లేమి నసం పూర్ణముగఁ గనిపించును గాని కావ్యము పూర్తియైనట్లు రఘు నాథాభ్యుదయమువలనఁ దెలియుచున్నది.

రఘునాథాభ్యుదయము కూడ నిదివఱలోఁ జెప్పినట్లు విజ యరాఘవ నాయకకృతమే, యక్షగానము. రఘునాథనాయ కాభ్యుదయ కథనే తీసికొని కవి కొన్ని వచనములతోఁ గలిపి యందలి ద్విపదపంక్తులనే నడుమ నడుమఁ గథాసంవిధానమును గలుపుట కతుకులుగఁ బొందించి నాటకరూపమున యక్షగాన ముగ రచియించెను. యక్షగాన కథకూడ నాయకీనాయక సమా సమాగమముతో సంపూర్ణమగుటచేత రఘునాథనాయకాభ్యు దయకావ్యము నంతటితో సంపూర్ణమైనట్లే తలఁపవలసి యుండును.

రఘునాథనాయకాభ్యుదయమునందలి కవిత్వము పాల్కు రికి సోమనాథ, రంగనాథాదుల కవిత్వమంత ప్రౌఢమైనది కాక పోయినను మృదుమధురమై, సరళమై, ధారాశుద్ధిఁ గలిగి యొ ప్పారుచున్నది. విజయరాఘవుఁడు గణనీయులైన ద్విపదకవులలో నొకఁ డనుటకు సందియము లేదు. నన్నయాది కవివతంసుల కాల మునాఁటి సంస్కృతపద బంధురమైన తెనుఁగుకవిత తంజావూరి యాంధ్ర నాయకరాజుల కాలమునాఁటికిఁ గడుంగడు తెలుఁగుఁ దనమును సేకరించుకొని సౌకుమార్యమును, లాలిత్యమును నల వరించుకొని యన్నివిధముల దేశియైనది. ప్రయుక్తములయిన పద ములు బహుళముగ నచ్చ తెనుఁగులే, యతి కోమలములే. ఒక్క యీరఘునాథనాయకాభ్యుదయముననే కాక తెనుఁగు కవితలో వచ్చిన యీమార్పు నాకాలమునాఁటి పద్యప్రబంధములలో

సయితము చూడఁగలము. ఈ రఘునాథనాయకాభ్యుదయము నందలి యితివృత్తముకూడ ప్రాచీన ప్రబంధకథావిధానమువలె దీర్ఘముగను, అనేక సంఘటనాత్మకముగను నుండక సామాన్య మయి తమిళదేశపు 'ఉలా' ప్రబంధపద్ధతి ననుకరించినది. ఒక విధముగ నిది తమిళసాహిత్య ప్రభావ మనఁదగునేమో; ఏలన, నులాప్రబంధము తమిళమున నతిపురాతనమైనది. తమిళభాషకుఁ గల మొట్టమొదటి సంపూర్ణ వ్యాకరణము "తొల్కాప్పియము". ఈ వ్యాకరణములోఁ 'బుఱత్తినై ఇయల్' అను సూత్రమునఁ బ్రత్యేక ములా ప్రబంధములను గుఱించి చెప్పఁబడినది. ఇవి దేవతల రథోత్సవములకు ప్రసిద్ధపురుషుల గజోత్సవ ములకు సంబంధించిన వర్ణనలతోఁ గూడినవి. ఇందలి యితివృత్తము ఇటువంటి యుత్సవము తమ వీథిని సాగుచున్నప్పుడు దానిని జూచుట తటస్థించు సప్తవిధగణికలలో నొకవిధమునకుఁ జెందిన కన్యకప్రేమప్రకటనగాథకు సంబంధించినది. దీనిననుస రించి చూడఁగా మనకథలోని నాయికకూడ గణికయై యుండ వచ్చునని తోఁచుచున్నది.

ఈ కావ్యమునందలి వర్ణనము లన్నిటిలో నిచట ముఖ్యముగాఁ బేర్కొనవలసినది తంజాపుర వర్ణనము. తెలుఁగుకావ్యములలో నోరుగంటి నగరమును సవిశేషముగ వర్ణించిన క్రీడాభిరామములోఁ దక్క మఱి వేనియందును మన కావ్యములోవలెఁ బురవిశేషము లభివర్ణితము కాలేదు. పరిఘగోపురప్రాకారాదులు వర్ణించినవెనుక కవి రాచనగరు నభివర్ణించెను. నగరికిఁ జుట్టును సానికూఁతుల యిండ్లున్నవీథులు. ఈ వీథులనడుమ ప్రహరితోఁ గూడినకోట. దానిలోబంగారు కలశములతోఁగూడినహాజారము. తరువాత గజఘటలుండు 'పెనులాగడపుఁబని పెద్దబవంతి',

చేరువనే గుజ్జము లుండు 'పటానిబవంతి' మేడ. తరువాత సం ప్రతికరణముల విశాలశాల. సంప్రతికరణములు గ్రామకరణముల కంటెఁ బదవిలోఁ బెద్దవారు; కొన్ని గ్రామములను గలియఁజేర్చి యేర్పాటుచేసిన ఖండమునకుఁ గాని, పెద్దరాజ్య విభాగమునకుఁ గాని యాయవ్యయములకుఁ సంబంధించిన లెక్కలను వ్రాయు పెద్దకరణములకు సంప్రతులని పేరు. వీరికిఁ గవిలె సంప్రతుల నియు వ్యవహారము గలదు. సంప్రతికరణముల విశాలశాలకుఁ దరువాఁత నున్నది శ్రీరామభద్రశాల. దీనిలో శ్రీరామచంద్రుని భావచిత్ర ముండెను. ఇది రంగులతో రచియించిన చిత్రము కాఁద గును. శ్రీరాముని చిత్రమున్న కారణముననే దానికి రామభద్ర శాల యనిపేరు కలిగినది. ఈ శాలకుఁ బిదప కోనెవాకిలి. కోనె యన నంతఃపురము. కోనెవాకిలికడ గుఱిగొల్ల లెల్లప్పుడును వెదురుకఱ్ఱలు పుచ్చుకొని కావలి కాయుచుందురు. కోనెవాకిలి దాఁటగనే సామంతరాజులు దొరలు శ్రేణులు గట్టి వేచియుండు లక్ష్మీవిలాసభవనము. దీనిచెంతనే 'చల్వరాతిచేఁ జెలఁగి సింగం పుఁ బని వైఖరులఁ గనుపట్టువాకిలి'. దీని చెంగటఁ బున్నాగవృక్ష శీతలచ్ఛాయను అచ్యుత రంగకూటము, నాకపురీవిలాసగేహము, కులగిరిని బోలిన 'లాఁగులచప్పరము" గరడికూటము, నవరత్న మయమైన నాటకశాల, మదనావతారుఁడై మన్నారుఁడున్న మదనగోపవిలాస మందిరాంగణము[1]. ఇది మన్నారు దేవుని దేవా యతనము కాఁదగును. దీనితోఁబాటు పేర్కొనఁదగినది 'బంగారు చెక్కడపుఁ జప్పరము'ను చాలవిప్పై యొప్పు చల్వరాజగతి గలిగి

1. ఇదియే కావ్యము నాలవ పుటలోఁ దెలిపిన మాన్నారు కోవెల యగునేమో.

పుష్పక విమానమువలెనున్న శ్రీరామసౌధరాజము[1]. పట్టాభి రాముని భావచిత్ర మున్నందువలననే యీసౌధమునకు శ్రీరామ సౌధరాజమని పేరు వచ్చినట్లు కాన్పించును. తంజావురాంధ్ర నాయక రాజచరిత్రకారులగు శ్రీ కురుగంటి సీతారామయ్యగారు శ్రీరామసౌధరాజమునుగుఱించి యిట్లు వ్రాయుచున్నారు.

"వీనిలో (పూర్వోక్త భవనములలో) నిప్పుడు నాయక రాజుల దర్బారుహాలని చూపునట్టి భవనము... శ్రీరామసౌధ మని నా యభిప్రాయము. అందు రామ పట్టాభిషేక పటము చిత్రింపఁబడినది. అందువలన దీనికి శ్రీరామసౌధమని నామ మిడియుండవచ్చును. ఇం దిప్పుడు తరువాతి మహారాష్ట్రరాజగు 'శరభోజి' యొక్క శిలావిగ్రహము కలదు. తచ్ఛిలావిగ్రహము క్రింద పూర్వము నాయకులకాలమున సింహాసనముక్రిందనుండు నొక మిక్కిలి విశాలమగు చలువరాయి యొకటి కలదు. అది

1. చల్వరాజగతి- "16 మూళ్ల పొడుగు 13 మూళ్లవెడల్పు, $1\frac{1}{2}$ మూర యెత్తు గలిగి నిగనిగలు దేరుతూ శ్రీరామసౌధమున నల్లచల్వరాయి యిప్పటికిన్నీ కలదు. ఇంతకంటె తక్కువది వేరొకమంటపమున గలదు. బృహదీశ్వరుని కోవెల మీద యింకొకటి కలదు"—తంజావూరి ఆంధ్రరాజుల చరిత్ర, పుట. 31.

గోవిందదీక్షితులవారు రచియించిన సంగీతసుధలో నీ భవనరాజము లలోఁ గొన్ని వర్ణితములైనవి, చూడుఁడు :

లక్ష్మీవిలాసోऽపిచ భద్రశాలా
శ్రీరామసౌధోऽపిచ హేమకూటః
అన్యాశ్చ యత్రాచ్యుతరంగముఖ్యా
స్సభా స్సుధర్మోపమితా జయంతి.

పైని చెప్పిన నాటకశాలలోనే ఆంధ్రనాయకరాజుల కాలములో విజయరాఘవ నాయకుఁడు మొదలైనవారు రచియించిన రూపకములను ప్రదర్శించువారు.

యనేక చరిత్రకారులచే ప్రశంసింపఁబడియున్నది. తత్కాలపు భవన నిర్మాణపద్ధతి యీ భవనమువలన తేటపడ గలదు. కొయ్య యెచ్చటను నుపయోగించి యుండలేదు. మహారాష్ట్రులే తత్సభామందిరమును వదలి ప్రత్యేకముగా వేరు దర్బారుహాలును కట్టుకొనిరి. అది యిప్పటికిని కుడ్యచిత్రకర్మ సమేతమై ప్రకాశించుచున్నది. చూపువలననే వెనుకటిదానికంటె యిది యధునాతనమని తెలియగలదు. వెనుకటి నాయకులు కట్టిన ట్లుంచక మహారాష్ట్రరాజులు కోటను మార్చినట్లు స్పష్టము."

శ్రీరామసౌధ రాజమునకుఁ బిదప బంగారు తలుపులుగల విజయభవనరాజము. అచ్చట వేదికమీఁద నెల్లపుడును గంచుకీ వర్గము కావలికాయుచుండును. ఈ విజయభవనరాజ స్వర్ణకవాట ఘటిత మార్గము నధిగమించినచో నిందిరామందిరము[1]. మందిరములలోని కెల్లఁ బ్రశస్తమై మణిమయ విరాజితమైన యద్భుత సదన మిది. చంద్రకాంతపు సంతనపనులతోను, పగడాల కంబములతోను, మగతాల మదనచేతులతోను, దంతపుఁ జేరుళ్ళ తుదలఁ జెన్నారు మలచిన చీని పక్షులతోను, గెంపుతాపనుల బోదియలతోను, బచ్చుతాపలకల పైకప్పు, ఇంద్రనీలముల

---

1. సంభావనీయాద్భుతశాత కుంభ
సంభావళీ సంభృత నూత్నరత్నైః
రమ్యావిశేషేణ సభా విభాతి
తత్రేందిరామందిర నామధేయా.
యస్యా స్సమీపే శతశో విభాంతి
నృపాంగనారత్ననివాసయోగ్యాః
గృహావిచిత్రోపవనీ విహార
ప్రాసాదకేళీ సరసీసమేతాః ॥ (సంగీతసుధ)

లోవరితోను, చలువగోడలతోను, గట్టాణి సోగము త్తెముల చికిలి కుచ్చులతోను, వైడూర్యపు దారబందములతోను, మగఱాల సంతన మడత తలుపులతోను, నింక ననేకచిత్ర విచిత్రాలంకారములతో నిందిరామందిరము నిక్కముగ నిందిరామందిర శోభతోఁ బొలుపారుచుండెను. ఈ యిందిరామందిరములో నాయక రాజ విజయగాథలను జిత్రించిన భావ చిత్రములు కలవు. ఇందిరామందిరము జోడు విజయరాఘవ విలాసగృహరాజము[1]. ఇట్లనేక మందిరములతోఁ జూడ వేడుకయైనది తంజాపురాంధ్ర నాయక రాజసదనము. ఇందిరామందిరములో నొకనాఁడు వేఁకువ రఘునాథనాయకుఁడు నిద్ర మేల్కొనుటతోనే మన కావ్యము లోని కథ యారంభమగును.

కవియైన విజయరాఘవ నాయకుఁడు సందర్భానుసారముగాఁ దన కాలమున వాడుకలోనుండిన యాచార మర్యాదలు, జంత్రవాద్యములు, నాట్యములు, స్వర్ణాభరణ విశేషములు మొదలైనవి పేర్కొనియున్నాఁడు. ఈ వర్ణనలను బురస్కరించుకొని మన మానాఁటి యాంధ్రనాయకరాజ జీవితమును జక్కఁగా నవబోధము సేసికొని కంటికిఁ గట్టినట్లు పునర్నిర్మింపవచ్చును.

ఆంధ్రనాయక రాజుల కాలమున వాడుకలోనుండిన జంత్ర వాద్యము లివి : వీణె, మురళి, రబాబు, తంబుర, కిన్నర, ముఖ వీణె, స్వరమండలము, రావణహస్తము, చెంగు, దండె, డక్కి, గట్టివాద్యము, తాళము ; వీనినిఁ బదచాళి, పేరణి, జక్కిణి, కొర

---

1. విజయరాఘవ విలాసభవనములో శారదాధ్వజ ముండెనట. చెంగల్వ కాళకవి యీ శారదాధ్వజమును జమత్కారముగఁ దన కావ్యమున నభివర్ణించినాఁడు.

పంజి, గుజరాతి, దేశి, దురుపదకేళిక, శివలీల మొదలైన నాట్య బంధముల నభినయించు సందర్భమున వాయించువాడు. ఉత్స వావసరముల వాడుకలోనుండిన వాద్యములు చిఱుతమద్దియలు, కాహాళలు, భేరులు, డవిణలు, ఢక్కలు, నాగసరములు, నరగ జములు, ధవళశంఖములు మొదలైనవి.

ముద్రికాభరణము, ముత్యాలయొంట్లు, శ్రీరామభద్ర తాళి, ముత్యపురాపులు, పెద్దచౌకట్టులు, కంఠమాలికలు, కంట సరము, పచ్చల పదకము, బవిరిచెక్కడపు ముత్తెపుఁ దాళి, వజ్ర ముల యుత్తరిగలు, వజ్రములచే సరులు, మెఱుపుల కడియ ములు, బాహుపురులు, రత్నాంగుళీయములు, నవరత్నములు తీర్చిన బిరుదు పెండేరము, ఒంట్లు - ఇవి రఘునాథనాయకుఁడు ధరించిన యాభరణ విశేషములు. స్త్రీల యాభరణములుగఁ దెలియవచ్చున వివి: ముంగాముఱారి, కంకణములు, ఉంగరములు, ముత్యాలమురువుల బవిరలు, బుగడలు, కమ్మలు, ముంగర, ముత్యాలకంటె, కంటసరములు బన్నసరములు, పంజుల పదక ములు, కంఠమాలికలు, సరిపెణలు, జాళువా గొలుసులు, పుం జాలదండలు, సందిదండలు, గంటల మొలనూలు, ఒడ్డాణము, పచ్చఱాపలకల పాదపల్లవము, అందియలు, గిలుకు మట్టియలు, జాళువా కడియము, పెంచురతనాల కుచ్చు, కిరీటి, బవిర పదము భ్రమర మను సంస్కృత శబ్దము వికృతియేమో. భ్రమరక ములను ఆభరణ విశేషముగ ప్రాచీనకవులు వర్ణించినారు. బన్న సర మన్నది వర్ణసరము వికృతి; "తత్రైవ నీలసంయుక్త ముక్తం పూర్వక్రమేణ తు, కృతో వర్ణసరోనామ దర్శనీయో మనోహరః" అని చాళుక్య సోమేశ్వరుఁడు కంఠాభరణములను వర్ణించు సందర్భమున వర్ణసరమునుగుఱించి తన యభిలషితార్థ చింతా

మణిలోఁ జెప్పినాఁడు. వేఱువేఱు రంగుల రత్నములనుగాని, రంగురంగుల పూసలనుగాని చేర్చి తయారుచేసిన సరమునకు బన్నసరమని పేరు. ఇట్టి కంఠాభరణములలోఁ బంజులపదకము లోకరకము ఇందలి పంజుశబ్దమున కర్థమేమో. పంజుల పదక ములవంటివే పంజుకమ్ములను కర్ణాభరణములును గలవు. 'పంజు మంచము' కూడ నున్నది ("పంజుమంచము డిగ్గి పంజుఘోష"); "కడలియం దేకోదకము వేళఁ బుట్టిన పవడంపుఁ దీఁగల పంజు తోడ" అని శ్రీనాథ ప్రయోగము. దీని ననుసరించి చూడఁగా ఒకటి రెంటికంటె నెక్కువగానున్న సన్నని బంగారుతీఁగె గొలుసులు కలియఁజేర్చిన యాభరణము పంజులపదక మగునని తోఁచు చున్నది.

ఏదో యొక విందునో భోజనమునో పురస్కరించుకొని తెలుఁగువారి భక్ష్యభోజ్యాది పదార్థములను విస్తరించి వర్ణించిన యాంధ్రకవులు శ్రీనాథుఁడు, కాకమాని మూర్తి మొదలైనవారు చాల కొద్దిమంది గలరు. కాని వారు వర్ణించినది బ్రాహ్మణుల శాఖాహార భోజనము. మన రఘునాథనాయకాభ్యుదయమున విజయరాఘవనాయనయ్యవారు కూడ రఘునాథ నాయకుని భోజనాదికములను సవిస్తరముగ వర్ణించెను. ఇది శూద్రుల మాంసాహార భోజనము. మూర్తి, శ్రీనాథుల భోజనవర్ణనలోవలె నిందు నిషిద్ధనలు కనిపింపకపోవుట గమనింపఁ దగిన విషయము.

భోజనవర్ణన మిషతోఁ గవి యానాఁడు మహారాజ మహానసమునఁ దయారగుచుండిన వంటకములు పెక్కింటి నేకరువు పెట్టినాఁడు. ఆంధ్రనాయకరాజు లారగించుచుండిన భోజన

పదార్థములు పలురకములైనవి, పుష్టిని గూర్చునవి: శాలితండుల ప్రసాదము, బంగారు చాయపప్పులు, సద్యోఘృతము, పచ్చడులు, నీరుమజ్జిగలలో విశేషములేదు. నీరుమజ్జిగయని యది వట్టితేటమజ్జిగ కాదు.

'సారమౌ జంబీర సారంపురుచులు
మీఱంగ లవణంబు మితముగాఁ గూర్చి
మేలైన సొంటితో మిళితమైనట్టి
యేలకిపొడి వైచి యింపు దీపింపఁ
దగు వట్టివేళ్ళ చే తావులు

కట్టిన, నీరు మజ్జిగ యది. పైని చెప్పినవికాక కప్పురకోడి, కుంకుమకోడి, కస్తూరికోడి, పాలకోడి, కట్టుకోడి, నులువకోడి (?), చేఁపలయూర్పు, బిరంజి, చిక్కుడుకాయ రొయ్యల యూర్పు, పొడికూరవరలు, చలువ యూనము (?), ఉప్పురసము, శిఖరిణి మొదలైన రసవర్గము లనేకములు. ఇవి కాక పేణీలు, గుండెగలు, లడ్వములు, వెన్నకజ్జాయము, మణుఁగుఁబూలు, అతిరసాలు, సారసత్తులు[1], పన్నీరు పాయసము, జీలకర పాయసము, డాల్వైచిన చలువపాయసము, సొజ్జిపాయసము, కరివడలు, దధివడలు, ఆమ్రపువడలు, తెలికుక్కరొట్టె, తెంకాయరొట్టె, సంబారురొట్టె, తెరటుబాలు, తనిబాలు, తెంకాయపాలు మొదలైన భక్ష్య భోజ్య పానీయాదు లనేకవిధములైనవి.

---

1. సారసత్తులన్న పదము శబ్దరత్నాకరమునఁ గానరాదు. సారెసత్తులని కలదు. దీనినే శ్రీనాథుఁడు కాశీఖండమున 'సాఁపత్తె' లని వాడినాఁడు (చూడుఁడు. కా. ఖం. ఆ. ౭, పుట 355 (వావిళ్లవారి ముద్రణము 1916).

ఇట్లే రఘునాథనాయనివారు స్వారివెడలు సందర్భమున ముస్తీదుచేసి తీసికొనివచ్చిన యైరావతవర్ణనమువలన నానాలమునఁ బట్టపుటేనుఁగునకుఁ జేయు నలంకరణ విధానము తెలియఁగలదు.

కావ్య మీా విధమున యథోచితములైన వర్ణన విశేషములతో వీనులకు విందుఁ గొలుపుచుండును. కుంటుగంటులు లేని ధారాళమైన మృదుమధుర శైలి విజయరాఘవునిది; చూడుఁ డీ క్రింది ద్విపదపంక్తులు:

"చిలుక తేజీయట చెఱకట విల్లు
బళిబళీ తుమ్మెదబారట నారి
చెంగల్వవిరులట చికిలివాలమ్ము
లంగంబు లేనివాఁడట యేటుకాఁడు
ఆయమ్ము లెవ్వారి యాయమ్మునాఁటె
నోయమ్మ యిటువంటి యూహాలు గలవె?"

ఇట్లు భావోద్వేగమునఁ బదములు లలితమైన కూర్పులోఁ బడి ప్రతిచరణము నడ్డమాఁకలు లేక పరువులువారుచుండును. ఆ కాలమున మనోరంజకములైన ద్విపదకావ్యములు రచించిన కవులలో నీ విజయరాఘవ నాయకుఁడు మేటియని చెప్పుటకు సంశయింపఁబని లేదు.

ప్రాస, యతివిశేషములు :

మొత్తముమీాఁద విజయరాఘవనాయకుని కవిత్వము సలక్షణమైనది. అందు లాక్షణికు లంగీకరింపని యంశము లంతగఁ గానరావు. పెక్కుఁడు పరమలాక్షణికులైన కవుల

వలెనే ఈతఁడును లఘ్వలఘు రేఫ ప్రాసము నంగీకరించుటే కాక, ఎన్నికఁగన్న యితర ద్విపదకవులవలెనే వర్గప్రాసము నంగీకరించి ద ధ లకును, ట ఠ లకును ప్రాసము కూర్చినాఁడు. కనుఁడు :

వీథుల నెలతాల వింత సంతనల
వేదుల నిలిచి యవ్వీటి జవ్వనులు (పుట 33)

*  *  *

బైరిణీయంగులు బటువుపాగలును
గాటంపు బంగారు గంటపుటోరలు (పుట 50)

ఇట్లే ల, ళ కును ప్రాసము కలదు. ఇట్టివి పాల్కురికి సోమనాథాది ప్రసిద్ధ ద్విపదకవుల గ్రంథములలోనే కానవచ్చును.

ప్రాసవిషయమున గమనింపవలసిన విశేషము లింకొకటి రెండు కలవు. చూడుఁ డీ క్రింది చరణములు :

అనుపమభక్తితో నాదిత్యహృదయ
మంత్రరాజమును ముమ్మాఱు పఠించి (పుట 6)

మాకుఁ జేరిన మొదటి ప్రతిలో నీ రెండవ చరణము విడఁదీయ రాని తప్పులతో నున్నది. రెండవప్రతిలో నాచరణ మిట్లున్నది.

'మను రాజమెను ముమ్మారు పఠించి'

ఈ చరణము 'మన్త్రరాజమును ముమ్మాఱు పఠించి' యని సవరింపఁబడినది. అచ్చులో 'మన్త్ర'రాజమునుటకు మాఱుగా 'మంత్రరాజ' మని తప్పుగాఁ బడినది.

ప్రాసస్థానమున 'చ' యను ద్విత్వాక్షరము వచ్చినపుడు మాత్రము కవి 'యచ్యుత' యనుటకు బదులుగా 'అచ్చుత' యని వేసెను. చూడుఁ డీ క్రింది పంక్తులు :

అచ్చుత రఘునాథ యతిమోహనాంగ
విచ్చేయవలయు మా వెలఁది యింటికిని (పుట 65)

అచ్చుతేంద్రునిపట్టి యతివఁ జేపట్టి
మచ్చికతోడ నమ్మణి సౌధమునకు (పుట 79)

వెచ్చిన భూలోక దేవేంద్రుఁడైన
అచ్చుత రఘునాథుఁ డట గటాక్షింప (పుట 30)

అచ్చుతేంద్రుకుమారు నసహాయశూరు
నిచ్చటి కేఁ దెత్తు నిదె పోయివత్తు (పుట 46)

అచ్చుతరఘునాథుఁ డంత నక్కడను
విచ్చలవిడి స్వారి విచ్చేసి మరలి (పుట 49)

ఈ సందర్భము లన్నిటను 'అచ్చుత' పదమును 'అచ్యుత' గా దిద్దినను ద్విపదకవులు పాటించిన ప్రాస సంప్రదాయ స్వాతంత్ర్యమున కది విరుద్ధమయినది కాదు. ఏలన ద్వితీయాక్షరస్థానము నందలి సంయుక్త వర్ణములలో దేనితోనైనను ప్రాసముఁ గూర్చుట పాల్కురికి సోమనాథాదికవు లంగీకరించిన నియమమే; చూడుఁడు, బసవపురాణములోని యీ క్రింది ద్విపదపంక్తులు :

చిత్తజాంతకు భక్తిఁ జెడనాడు ఖలుల
మృత్యువుగతిఁ ద్రుంపు మీా బసవన్న!

* * *

కర్ణంబు మీాఁదెఱుంగక పల్కుటెల్ల
బిజ్జలక్షోణీశ! పెద్దతికంబె

* * *

మర్త్యలోకమునకు నఱివేత యొకఁడు
కర్త యున్నాఁడె లోకత్రయవరద!

అయినను 'అచ్చుతేంద్రుని' 'అచ్చుతేంద్రకుమారు' అనునవి 'అచ్యుతేంద్రుని' 'అచ్యుతేంద్రకుమారు' అని సవరింపవలసిన యవసరముకూడఁ గలదు. కాని యితరస్థలములఁ దప్పక అచ్యుత యనివాడిన కవి పైని చూపిన సందర్భములలో నన్నిచోట్లను 'అచ్చుత' యనియే వ్రాసియుండుటవలన నవి సవరింపఁ బడలేదు.

మఱియొక విషయము. సమానప్రాసముగల బేసిచరణము లిందు నొకటి రెండు సందర్భములఁ గలవు. చూడుఁడు :

రాజకీరము వల్కె రాజదేవేంద్ర
రాజకంఠీరవ రాజాధిరాజ
రాజన్యమూర్ధన్య రాజదేవేంద్ర

* * *

నిలువుటద్దంబోక నెలఁతుక దాల్చు
నిలువుటద్దముచెంత నీటుగా నిల్వఁ
నలఁ పెజెంగి కడానిత త్తటల సొమ్ము

ఈ రెండు సందర్భములు నసాధారణము లనుటకు సందియము లేదు. ద్విపదకావ్యముల నిట్టి వెందును గానరావు. అందువలన మొదటి సందర్భమున రెండవద్విపదలోని రెండవచరణము పోయి యుండవలెనని మానమ్మకము ; కాని యట్లు పోయినదని సూచించుటకు వచ్చినప్రతులు రెంటిలోను చుక్కలు కానరాక పోవుటవలన నవి యున్నవి యున్నయట్లే ముద్రితములైనవి.

ఇఁక రెండవ సందర్భమున నామూఁడు చరణములును మాకు వచ్చిన మొదటి ప్రతిలోఁ గలవు. ఈ పంక్తులు ముద్రితము లైన వెనుక మాకు రెండవప్రతి యందినది. అదియే మొదటి ప్రతికంటెను శుద్ధమయినది, సరియైనది. దానిలో రెండవచరణము 'నిలువుటద్దముచెంత నీటుగా నిల్వ' అన్నది లేదు. అందువలననే ఈ చరణమును దొలఁగించి తప్పొప్పుల పట్టికలో ఒప్పు క్రింద మిగిలినవి చూపఁబడినవి.

పదప్రయోగములు :

ఇదివఱలో నుడివినట్లు ఈ కావ్యమున దేశ్యములు— అచ్చ తెనుఁగులు మొదలైనవి యెక్కువ ; జత్తాయితము, కడితము, చడితము, వాగఱ, తంబుగ, సజ్జ, చప్పరము, ఉప్పరిక, ఉప్ప

వడెము, మదనచేతులు మొదలైన వనేకములు కలవు. గద్దియ రూపాంతరముగ గద్దిగకూడఁ బ్రయోగింపఁబడినది. రాజకార్య నియుక్తులలో గుటిగొల్లలు, బొక్కసమువారు, సంప్రతులు మాత్రమే కాక అనమువారు, వేగులవారు, వేత్రహస్తులు, మజాలశీలు, రాయసములవారు, అవసరములవారు మొదలైనవారు వేలువేలు పనులు నెఱవేర్చువా రెందఱో గలరు.

మొత్తముమీఁద నీరఘునాథనాయకాభ్యుదయ కావ్యమనేకవిధములఁ బ్రాముఖ్యమయినది; ప్రశస్తమయినది, ఏతత్కర్తయైన విజయరాఘవ నాయకుఁడు గొప్పకవులలోఁ బరిగణింపఁదగినవాఁడు; ప్రాచీనకవులవలె గొప్ప ప్రబంధము వ్రాసిననే గొప్పకవి కానక్కఱలేదు; గుణమున్న కవిత్వ మేది చెప్పినను గొప్పకవియే. అయితే ఈతని కవిత్వమునందలి వర్ణనవిధానము, నితరములైన పోకడలును ప్రాచీనకవులు చూపిన మార్గము ననుసరించినవే. అంతమాత్రమున నితనికి వచ్చిన తక్కువేదియు లేదు. నిజమునకుఁ బ్రబంధకవు లందఱును దమ పూర్వులు చూపిన మార్గమునఁ బోయినవారే వరవడి ఒక్కటే యైనను వారు తమ ప్రజ్ఞను వ్యక్తిత్వమును ఏవో కొన్ని విషయములఁ జూపి కీర్తి గడించుకొనిరి. అట్లే రఘునాథ, విజయరాఘవ నాయకులును సంగీత, నాట్యకళల నూతగాఁగొని ఆంధ్రసాహిత్యమునకు నూతనశోభ నొడఁగూర్చిరి. ఆకాలమున ద్విపదకావ్యములనుగూడ శ్రావ్యముగ వివిధరాగములతోఁ, దాళములతో గానముచేయువారు. ఈశ్రవ్య ప్రబంధములను యక్షగాన భాష

మున దృశ్యప్రబంధములుగ మార్చివైచి విజయరాఘవ నాయకుఁడు ఆంధ్రసాహిత్యమును బండితపామర జనరంజకము కావించెను. యక్షగానము తెలుఁగునాఁట శ్రీనాథుని కాలమునుంచియు నున్నదే. "కీర్తింతు రెవ్వానికీర్తి గంధర్వులు గాంధర్వమున యక్షగాన సరణి" అని శ్రీనాథుఁడు భీమఖండమున వచించియున్నాఁడు. దాక్షారామ భీమేశ్వర మహోత్సవ సమయములందు సానులు (వేశ్యలు) వేషములు వేసికొని నాటకము లాడుచుండిరని

'సాని యీశానియై మహోత్సవమునందుఁ
గేల నవచంద్రకాంతపు గిన్నెపూని
వీథి భిక్షాటన మొనర్చు వేళఁ జేయు
మరులు నృత్యంబు జగముల మరులుకొలుపు'

అనుపద్యమువలనఁ దెలియఁగలదు. యక్షగాన మంతటి ప్రాచీన కాలమునుంచి తెలుఁగుదేశమున నున్నను దానికి వ్యాప్తియు జనాదరమును గలిగినది దానిని తంజాపురాంధ్ర నాయకమహీపతులు చేపట్టిన పిదపనే. వారికాలమున యక్షగాన రూపకరచన సాహితీపరుల కొకలాలసయైనది. కవిత నేర్చినవాఁడు యక్షగాన రచన చేయకయుండలేదు. ఆంధ్రసాహిత్య చరిత్రలోఁ దంజాపురాంధ్ర నాయకరాజకాల మొకవిశిష్టమైన యుగము. అందు యక్షగాన సాహిత్య మొక విశిష్టమైనవాఙ్మయ సంప్రదాయము. ఈసాహిత్యమును పెంచి పోషించి క్రొత్తరీతుల వర్ధిల్లఁజేసినవాఁడు విజయరాఘవ భూపాలుఁడు.

రఘునాథనాయక, విజయరాఘవ నాయక పరివర్ధితమైన దాక్షిణాత్యాంధ్రసాహిత్యసంప్రదాయ మంతటితోఁ దెగిపోకుండ దాని నాదరించి చేపట్టి యింకను బెంపొందించిన వారు ఆంధ్ర నాయకరాజుల యనంతరమునఁ దంజావూరి రాజ్యమును బరిపాలించిన భోసలవంశజులైన మహారాష్ట్రులు, - వెంకాజీయను నామాంతరముగల యేకోజీసంతతివారు. వారుకూడ నప్పటికి రాజభాషగనుండిన తెనుఁగు నభిమానించి యాదరించి పోషించుట వలననే నాయకరాజుల కాలమున వచ్చిన యాంధ్ర సాహిత్యము కొంతవఱకైన నిప్పటివఱకు నిలిచియున్నది. తంజావూరి మహారాష్ట్ర రాజులుకూడ రసజ్ఞులు; నాట్య, సంగీతప్రియులు; ఆంధ్ర సాహిత్యపోషకులు; విశేషించి వారు తెనుఁగున కవులు; పెక్కు గ్రంథములు రచించినవారు. అందువలననే వారి సరస్వతీ భాండాగారమున మనకీ రఘునాథనాయకాభ్యుదయాదులు సురక్షితములై దొరకుట కవకాశము కలిగినది.

మల్లంపల్లి సోమశేఖరశర్మ.





# రఘునాథనాయకాభ్యుదయము

## ప్రథమాశ్వాసము

శ్రీరాజగోపాల చిరకీర్తిజాల
కారుణ్యగుణశీల కల్యాణలోల
గోవర్ధనోద్ధార గోపకుమార
భావజసమరూప బహుళప్రతాప
నందగోపకుమార నవనీతచోర
చందనమందార సమకీర్తిహార
కరుణారసాపాంగ గరుడతురంగ
పరమవచోవేద్య భవరోగవైద్య
దక్షిణద్వారకాస్థలకృతలీల
రక్షింపఁగదవయ్య రాధికాలోల
కలశాంబునిధికన్య కల్యాణధన్య
సలలితసౌజన్య జగదేకమాన్య
వందారు శర్వాణి వారిజపాణి
మందరధరురాణి మధుకరవేణి
పరమదయాలోక పాలితలోక
నిరతగజానీక నియతాభిషేక
భారతీ పార్వతీ భామలలోన
కోరిన వర మిచ్చు కువలయనయన
శ్రీచెంగమలవల్లి చెలువైన తల్లి
కాచి రక్షింపవే కనకాంగవల్లి

అపశబ్దగజముల నస్మత్కవిత్వ
విపులాద్రిగుహలలో విహరింపకుండ
సూత్రవతీశ నీ శుభకరకలిత
వేత్రంబుఁ గదలించి విదళింపవయ్యా
అని యిష్టదేవతాప్రార్థన చేసి
మనసున రెండవ మ్మననారగుచు
బరమచతుర్వేదపారీణు లగుచు
గరిమ మీఱఁగ శతక్రతుయాజు లగుచు
వీరవైష్ణవులన వెలసిన ఘనుల
సారెకు తాతయాచార్యులఁ గొలిచి
యనుపమస్వర్ణవర్ణాపూర్ణమైన
తనశరీరంబు నిద్దపు మిద్దెగాఁగ
మొగములు నాలుగు మొగములయందుఁ
దగు వేదములు నాల్గు దళములు గాఁగ
మోముల సుద్దుల ముద్దులగుమ్మ
యామధురసధారయై మిటారింప
నారాజముఖచేతి యందమౌ వీణె
చారుతంత్రీరవ ఝుంకార మెసఁగ
నారసధారకై యటు చేరినట్టి
తోరంపు మధుకరధోరణి గాఁగ
తనుఁ గన్న యా వెలిదామరలీల
మను మహామహు పితామహు నుతిచేసి
తనదు కౌఁగిటనున్న తామరచూలి
తనుకాంతి తనకాంతి తనవీణెకాంతి
కలసి త్రివేణీవికాసంబు చూప

లలితశుభస్వప్నలబ్ధుని నన్ను
సారసారస్వతసంపన్నుఁ జేసి
గారవించినవాణిఁ గల్యాణిఁ దలఁచి
తనదు దేవతపేరు దాల్చితి ననుచు
ఘనవైష్ణవమతంబుఁ గైకొంటి ననుచు
నిరతంబు నామీఁద నెనరుంచినట్టి
పరమవైష్ణవుఁడైన భవుని భావించి
కాలకూటముఁ దిన్న కస టెల్లఁ దీర
కైలాసవాసికిఁ గమ్మకెమ్మోవి
పంచదార లొసంగి బడలికల్ దీర్చు
మంచుగుబ్బలిరాకొమారినిం దలఁచి
వాసిమీఱఁగ వ్యాస వాల్మీకి కాళి
దాస భాస మురారి దండి సుబంధు
భవభూతి భారవి బాణ మయూర
శివభద్ర రుద్రట శ్రీహర్ష హర్ష
జయదేవ మాఘాది సంస్కృత కవులఁ
బ్రియపూర్వకంబుగాఁ బేర్కొని పొగడి
నన్నన నెఱ్ఱన నాచనసోముఁ
జిన్ననఁ దిక్కన శ్రీనాథుఁ దలఁచి
యొకరి యెంగిళ్లకు నోడికట్టునట్టి
కుకవులపేరుఁ బేర్కొనుట చాలించి
సంగీతసాహిత్యసరణి నే నొక్క
శృంగారకావ్యంబు సేయ నూహింప
నంతట నొక్కనాఁ డరుణోదయమునఁ
గాంతామనోహరకందర్పకోటి

లావణ్యలీలావిలాసంబువాఁడు
మోవిపైఁ జిరునవ్వు మొలకలవాఁడు
జగజంపు నెత్తావి సంపంగిదండ
సొగసుగా సిగనిండఁ జుట్టినవాఁడు
కరుణారసముఁ జిల్కు కడకంటిచూపు
బురుణింప నొకమహాపురుషశేఖరుఁడు
సకలభూషావిశేషములు ధరించి
యొకచెల్వు గొల్వ నాయొద్దికి వచ్చి
సాక్షాత్కరించి ప్రసన్నుఁడై నిలువ
నీక్షించి నెమ్మది నిమ్మహామహుఁడె
యిష్టదైవమటంచు నిచ్చలో నెంచి
సాష్టాంగదండంబు లపు డాచరించి
పరవశత్వమున నే భక్తితో నిలువఁ
బరమదయాళుఁడై పలికె నవ్విభుఁడు
విజయరాఘవ వత్స వినుము మామాట
భజియింపుచును మమ్ముఁ బ్రతివత్సరంబు
నిర్భరభక్తితో నీవు హిరణ్య
గర్భదానంబులు గావించువేళ
నధరోర్ధ్వఫలకమోహనచిత్రరూప
విధముఁ గైకొని మేము వేడ్కతో నిలిచి
యాగర్భమందు నీ వావిర్భవింప
బాగుగా నిన్నుఁ జేపట్టి మాపట్టి
వని యెంచి మీతల్లి యరుణాబ్జవల్లి
చనుబాలు గ్రోలించి చాల లాలించి
తొలుదొల్త నీమేని దురితంబు లెల్లఁ

దొలఁగించి రాజ్యంబు ధ్రువముగా నొసఁగి
సొంపుగ నిను దయఁ జూచు పురాణ
దంపతులము నీకుఁ దల్లిదండ్రులము
విరవాది తావులు విరిసినరీతి
సరసవాక్యంబులసరణులు మీఱ
పదములు మంజరిప్రముఖకావ్యములు
మొదల మా కంకితంబులు చేసి తీవు
నీరచనకు మెచ్చి నీకు దీర్ఘాయు
రారోగ్యభాగ్యంబు లపు డొసంగితిమి
ధీచతురత మించ ద్విపదకావ్యంబు
నీచేత నందుకో నేఁడు వచ్చితిమి
మాయవతారమై మహి నుదయించి
మీయయ్యవై ధైర్యమేరువై మించి
యఘటనఘటనాసమర్థుఁడై వెలయు
రఘునాథమేదినీరమణునిచర్య
ధీకౌశలము మించ ద్విపదఁ గావించి
మా కంకితము సేసి మనుము వేయేండ్లు
అని పల్కి యపు డాదయాపయోరాశి
ననుఁ గటాక్షించి యంతర్హితుండైన
నుదయాద్రిపై భానుఁ డుదయించువేళ
నిదుర మేల్కొని పెద్ద నిలువుటద్దంబు
కపిలధేనువు పూర్ణకలశముల్ చూచి
యపుడు భూదేవద్వయంబు నీక్షించి
జలరుహలోచనల్ జలము లందీయ
జలకంబుఁ గావించి చలువలు గట్టి

యనుపమభక్తితో నాదిత్యహృదయ
మంత్రరాజమును ముమ్మాఱు పఠించి
శ్రీవిలసిల్లఁగాఁ జెలువుమన్నారు
కోవెలచెంగట గురువునానతిని
నామతీర్థంబయి నామాంకితమగు
శ్రీముద్ర ధరియించి శ్రీరాజగోప
మూర్తి భావింపుచు ముత్తెపు సరులఁ
బూర్తిగా నప్పుడు పురుషోత్తమునకు
నానందకరమైన యష్టాక్షరీజ
పానుసంధాన మొయ్యన నాచరించి
సంకుమదంబును జలువగందంబు
కుంకుమరసమును గూర్చిన తేట
నీటను దావి పన్నీట మున్నీట
మీటుగా విహరించు మేటి కవ్వేళ
నభిషేకమొనరించి యంచితభక్తి
నభినవ దివ్యాంబరాభరణములు
ఘనసారమిళితమౌ గంధసారంబు
మనసార నపుడు సమర్పణ చేసి
యలరుచుఁ గృష్ణసహస్రనామములఁ
దులలేని కాంచనతులసీదళముల
బంగారు పువ్వుల భావజగురున
కంగ ముప్పొంగ నొయ్యనఁ బూజ సేసి
దీపితనవధూపదీపాదిషోడ
శోపచారములెల్ల నొనరించి పిదప
భాగవతము రామభద్రచరిత్ర

భాగవతోత్తముల్ పఠియింప వినుచు
నిత్యదానములెల్ల నిష్ఠతోఁ జేసి
యత్యంతభక్తితో నయగార్ల కెల్లఁ
దాంబూలదివ్యచందనము లొసంగి
జాంబూనదాంబరు సన్నిధినున్న
పరమవైష్ణవులను బంచి కొల్వునకుఁ
గరుణతోఁ బ్రౌఢ సత్కవుల రప్పించి
కులగురుండగు తాతగురువు నీక్షించి
యలఘుతపోధుర్య యాచార్యవర్య
కలగంటి వినవయ్య కల్యాణశీల
నిన్న రే యొకవింత నీటుమీఱంగఁ
గన్నెపాయమువాఁడు కందర్పకోటి
లావణ్యలీలావిలాసంబువాఁడు
మోవిపైఁ జిఱునవ్వు మొలకలవాఁడు
జగజంపు నెత్తావి సంపంగిదండ
సొగసుగా సిగనిండఁ జుట్టినవాఁడు
కరుణారసముఁ జిల్కు కడకంటిచూపు
బురుణింప నొకమహాపురుషశేఖరుఁడు
సకలభూషావిశేషములు ధరించి
యొకచెల్వ గొల్వ నాయొద్దికి వచ్చి
విజయరాఘవ వత్స వినుము మామాట
భజియింపుచును మమ్ముఁ బ్రతివత్సరంబు
నిర్భరభక్తితో నీవు హిరణ్య
గర్భదానంబులు 'గావించువేళ
నధరోర్ధ్వఫలకమోహనచిత్రరూప

విధముఁ గైకొని మేము వేడ్కతో నిలిచి
యాగర్భమందు నీ వావిర్భవింప
బాగుగా నిన్నుఁ జేపట్టి మాపట్టి
వని యెంచి మీతల్లి యరుణాబ్జవల్లి
చనుబాలుఁ గ్రోలించి చాల లాలించి
తొలుదొల్త నీమేని దురితంబు లెల్లఁ
దొలఁగించి రాజ్యంబు ధ్రువముగా నొసఁగి
సొంపుగ నిను దయఁ జూచు పురాణ
దంపతులము నీకుఁ దల్లిదండ్రులము
విరవాదితావులు విరిసినరీతి
సరసవాక్యంబుల సరణులు మీఱఁ
బదములు మంజరిప్రముఖకావ్యములు
మొదల మాకంకితంబులు సేసి తీవు
నీరచనకు మెచ్చి నీకు దీర్ఘాయు
రారోగ్యభాగ్యంబు లపు డొసంగితిమి
ధీచతురత మించ ద్విపదకావ్యంబు
నీచేత నందుకో నేఁడు వచ్చితిమి
మాయవతారమై మహి నుదయించి
మీయయ్యయై ధైర్యమేరువై మించి
యఘటనఘటనాసమర్థుఁడై వెలయు
రఘునాథమేదినీరమణుని చర్య
ధీకౌశలము మించ ద్విపదఁ గావించి
మా కంకితముసేసి మనుము వేయేండ్లు
అని పల్కి యపు డా దయాపయోరాశి
ననుఁ గటాక్షించి యంతర్హితుం డయ్యె

నని తెల్పఁగా విని యాచార్యవరుఁడు
మనమున నుప్పొంగి మఱి యిట్టు లనియెఁ
జిరతరభక్తి మాచే ముద్రఁ బూని
పరమవైష్ణవులైరి భవదీయు లెల్ల
వినవయ్య మీవంశవృత్తాంత మెల్ల
వినుపింతు నీకు సవిస్తరఫణితి
వనజాక్షుపదముల వఱలు వాహినికి
ననుజరై (రహి)మించు నాలవజాతి
భుజవిక్రమాధార భోజావతార
విజయరాఘవ ధీర వీరాధివీర
ఆజాతిలోఁ జాల నధికులైనట్టి
రాజులు కొందఱు ప్రఖ్యాతిఁ గనిరి
వారిలోఁ గృష్ణభూవరుఁడు లావణ్య
కారుణ్యగుణముల ఘనకీర్తిఁ గాంచె
నమ్మహామహునకు నాత్మజుండైన
తిమ్మభూపాలుండు ధీరత వెలసి
బయ్యాంబిక వరించి ప్రౌఢి వహించె
నయ్యిరువురుఁ గాంచి రాత్మసంభవులఁ
బెదచెవ్వభూపాలుఁ జినచెవ్వవిభునిఁ
బెదమల్లభూజానిఁ జినమల్లనృపతి
వారిలోఁ జినచెవ్వవసుధాబలారి
మేరుధీరుఁ డనంగ మేదిని వెలసెఁ
జిరతరంబుగ భక్తి శ్రీశైలమందు
నరుణాచలమున వృద్ధాచలంబునను
శంకరార్పణముగా శాశ్వతానేక

కైంకర్యములు చేసి ఘనకీర్తిఁ గాంచె
సుగుణసంతతికి నచ్యుతరాయసతికిఁ
దగినసోదరి కృశోదరి మూర్తిమాంబ
యతనికి భార్యయై యఖిలభూపాల
సతులలో నార్యయై సన్నుతిఁ గాంచె
నచ్యుతేంద్రుఁడు వారి కాత్మజుం డగుచు
నచ్యుతుం డీతఁడే యని జనుల్ బొగడ
రంగధామునకు శ్రీరంగంబునందు
బంగారుసజ్జలుఁ బ్రాకారములును
రంగుమీఱు కిరీటరాజంబు మేలి
శృంగారవనములుఁ జెలువొందఁ జేసి
యెదిరిన మన్నీల నేపునఁ గదిసి
కదనంబులోఁ గెల్చి కవ్వడి యనఁగ
సతికి భారతికి శ్రీసతి కరుంధతికిఁ
బ్రతివచ్చు మూర్తిమాంబను వరియించెఁ
గౌసల్య దశరథక్ష్మారమణుండు
వాసిమీఱఁగ రఘూద్వహుఁ గన్నరీతి
నల మూర్తిమాంబయు నచ్యుతేంద్రుండు
నలనిభు రఘునాథ నరనాథుఁ గనిరి
రసికుఁ డాయచ్యుత రఘునాథవిభుఁడు
వసుమతీరాజ్యనిర్వాహకుం డగుచుఁ
దుండీరవీరుని దురములో దఱిమి
చండించి ఖండించె జగ్గభూవిభుని
నాలంబు చేసి పాండ్యావనిపాలు
పాళెంబు డాసి తద్బాలికామణులు

మొఱవెట్టఁగాఁ దన మూఁకలచేతఁ
జెఱవట్టి తెప్పించి చెలఁగె నాపట్ల
మన్నారు మీయయ్య మాయవతార
మన్నమాట యథార్థ మగునైన వినుము
యీయవతారవిహారంబుకన్న
నీయవతారమం దిదికదా వింత
జలకేళి సవరించు జలజలోచనల
వలువ లామన్నారు వంచించి తెచ్చె
రణకేళి సవరించు రాజులసతుల
మణుఁగులఁ దెచ్చె నిమ్మనుజేశ్వరుండు
ఇంతమాత్రముదక్క నీయిద్దఱికిని
వింత యే మున్నది వెండియు నితఁడు
చెలఁగుచు ఘనగిరిసింహాసనమున
నలరామదేవరాయలఁ దెచ్చి నిలిపె
నాదరంబునఁ బదియాఱుదానములు
వేదకోవిదులైన విప్రుల కొసఁగి
కోదండదీక్షాధిగురుఁడైన రాముఁ
డే దైవ మని యెంచు నెంచఁ డన్యులను
ఆరఘునాథనాయకశిరోమణికి
నారీలలామయై నారాయణునకుఁ
బట్టపురాణియా పాలమున్నీటి
పట్టికి సాటియా పరమకల్యాణ
గుణరత్నఖని యని కోవిదుల్ పొగడఁ
బ్రణుతిఁ గైకొని వెంపరాజచంద్రునకుఁ
బరగు లక్ష్మాంబకుఁ బట్టియై పుట్టి

పరమపతివ్రతాభరణమై మించు
లావణ్యవతికిఁ గళావతీసతికి
నావిర్భవించి నీ వభివృద్ధినొంది
విజయరాఘవనామవిఖ్యాతిఁ గాంచి
నిజభుజంబున నుర్వి నిర్వహించితివి
కురులు కూడనినాఁడె గుఱిదొరల్ పొగడ
దురములోఁ బడుమటి దొరను గెల్చితివి
పట్టాభిషేకవైభవముఁ గైకొన్న
యట్టిసంవత్సరమం దొకనాఁట
నవలీలగాఁ బదియాఱు దానములు
సవరించి ద్విజుల కొసంగితి వీవు
వీరుఁడౌ సవరము వేంకటపతిని
పాఱఁదోలించి నీ పనుపులచేతఁ
బట్టైనసీమలోఁ బంద నెల్లూరు
కట్టించితివి ఘటికామాత్రమున నె
శ్రీరంగరాయలఁ జేపట్టి నిల్పి
యారాయకార్యంబు లౌగా దటంచు
దుండగించిన పాండ్య తుండీర పతుల
ఖండించి వాకిలిఁ గావఁ జేసితివి
తడలేని మృష్టాన్నదానసత్రములు
నడపుచున్నాఁడవు నానాఁట హెచ్చ
రత్నాంగియుఁ గిరీటరాజంబు దివ్య
రత్నభూషణములు రథగజాశ్వములు
ప్రాకార గోపుర ప్రాసాదములును
వైకుంఠసభ పుష్పవనతటాకములు

ప్రకటించి రాజగోపాలదేవునకు
సకలకైంకర్యముల్ సంఘటించితివి
నవనవంబుగ రఘునాథపురాది
వివిధాగ్రహారముల్ వెలయఁజేసితివి
ఏకాలమును దండ్రియే దైవ మనుచుఁ
జేకొని పూజలు సేసెద వీవు
కావున నీనడకకు మెచ్చి యిష్ట
దైవమా దక్షిణద్వారకావిభుఁడు
నీకుఁ బ్రసన్నుఁడై నీవు కావించు
నాకావ్య మందుదునని యానతిచ్చె
మన్ననారనుమతి మాయనుమతియుఁ
గన్నావు గనుక నాకనకాంబరునకుఁ
దారహారముగ మీతండ్రిచారిత్ర
మారూఢి ద్విపదకావ్యము సేయు మనుచు
సాక్షాత్కరించి ప్రసన్నుఁడై యున్న
దక్షిణద్వారకాధ్యక్షుఁడై మించు
తిరుమల శ్రీతాతదేశికోత్తముఁడు
కరుణించి యనుమతిఁ గావించెఁ గనుక
వరవైఖరుల నేను వర్ణింపఁబూను
చరితంబు మద్గురుచరితంబె గనుకఁ
దండ్రికన్నను వేఱె దైవంబు లేద
టండ్రు భూసురులు నే నది మది నెంచి
ఘనవచోరచన సత్కవిరాజు లెల్లఁ
గొనియాడ నేఁడు మత్కులదైవమైన
జలధరసచ్ఛాత్ర ? ఛాఢ్యగాత్రునకు

జలజాతపత్రవిశాలనేత్రునకు
దక్షిణద్వారకాస్థలమందిరునకు
వక్షస్స్థలావాసవలదిందిరునకుఁ
బరమవైష్ణవతపోభాగధేయునకు
నరకిన్నరస్తుత నామధేయునకు
నవ. ర్హా ? శకటదానవవిజయునకు
సవిధసేనావిచక్షణవిజయునకు
ఫణిరాజశాయికిఁ బరమకల్యాణ
గుణశీలునకు రాజగోపాలునకును
అంకితంబుగ మనోహరవచోరచన
లంకరింపఁగ నేను హవణింపఁబూను
నవ్యమౌ రఘునాథనాయకాభ్యుదయ
కావ్యంబునకుఁ గథాక్రమ మెట్టి దనినఁ
దిరమైన నేరేడుదీవిలోపలను
భరతఖండంబు నాఁ బరగు భూస్థలిని
నఖిలదేశంబుల కగ్రణి యగుచు
సుఖకరంబై యొప్పు చోళమండలము
మేదినిపైఁ గల్గు మేటి దేశముల
కాదేశమై మించు నాదేశమందుఁ
గావేరికాతీరఘటితాగ్రహార
పావనజీవనోపాయధౌరేయ
భూరిజనాగణ్యపుణ్యమై చంప
కారణ్య కుంభఘోణాదుల కెల్ల
నాయకంబై తంజనగరాధిరాజ
మాయయోధ్యాపురిహరువున వెలయు

నావీటఁ గలకోట హరువు లెచ్చోట
భావింపఁగలఁడె యాపరమేష్ఠియైనఁ
గోటబైట జలంబుఁ గ్రోల నేతెంచు
మేటిమత్తేభముల్ మేఘముల్ గాఁగఁ
బాతాళమున నున్న పన్నగరాజ
జాతోదరులు తటిజ్జాతముల్ గాఁగఁ
దగు పుండరీకముల్ తారలుగాఁగ
గగనసమానమై గనుపట్టు పరిఘ
పరిపూర్ణగోపురప్రాకారములును
దిరుమాళిగల మించు తేరువీథులును
నిరతోత్సవంబుల నెగడిన దివ్య
తిరుపతు లచ్చటి దేవాలయములు
వేదశాస్త్రపురాణవిద్యాధురీణ
వైదికాగ్రణులైన వైష్ణవోత్తములు
దురములో వేటాడు తనియలు గాఁగ
నరశిరమ్ములను జెండాడు రాజులును
గణనకు నెక్కుడౌ కనకముల్ దివ్య
మణిగణంబులుఁ గల్గి మనువైశ్యవరులు
వసుమతిపై వీరవైష్ణవసేవ
నసమానులైన నాలవజాతివారు
జగతిపైఁ దమ కులాచారంబులకును
దగిన వర్తనములఁ దనరుదు రచట
రాకుమారుల మనోరథములై మించు
శ్రీకరమణిగణాంచితరథంబులును
గుంభినిపై నడగొండ్లలో యనఁగ

గంభీరగతిఁ బొల్చు గంధనాగములు
వసుధ మనోవేగ వాయువేగముల
నసమానగతి నొప్పు హయచయంబులును
దారుణ రణకళా ధౌరేయమైన
వీరభటశ్రేణి విలసిల్లు నచట
శుభచిహ్నముల సోమ సూర్య వాస్తువుల
విభవంబుఁ గను రాజవీథులయందుఁ
బనుపడ దీనార బంగారు వ్రాఁత
పనిమించు గొప్పయుప్పరిగల చెంత
గోవ జవ్వాది కుంకుమ మృగనాభి
పూవుల సరములు పునుఁగు కప్పురము
పగడముల్ కెంపులు పచ్చలు హెచ్చు
మగఱాలు మొదలైన మణివిశేషములు
బహువస్తువులుఁ గల్గి భాసిలు నధిక
మహిమచే నంగడి మళిగ లచ్చటను
గలువలఁ దమ్ముల గమగమ వలచు
కొలఁకుల కెలఁకుల కొలకులంబులకు
బహుశారికాకీరపారావతముల
రహికెక్కి మించు నారామంబు లచట
భావసంభవకళాపరమరహస్య
కోవిదలగు సానికూఁతులయిండ్ల
విన్నాణమగు చుట్టువీథుల నడుమఁ
బన్నిన తిన్నని ప్రహరిలోపలను
బంగారు కలశముల్ పై మిటారింప
సింగారమై విరాజిలు హజారంబు

ఘనతరమదగజఘటలచేఁ దనరు
పెనులాగడపుఁబని పెద్దబవంతి
మరుతుమావులు హురుమంజితేజీల
నిరుపమంబగు పటాణిబవంతిసజ్జ
ప్రతిలేక నగరిసంప్రతికరణములు
జతగూడి వ్రాయు విశాలశాలయును
బటుతరశ్రీరామభావచిత్రంపుఁ
బటము నిల్పిన రామభద్రశాలయును
దరతరంబులు వేణుదండముల్ పూని
గుఱిగొల్ల లున్నట్టి కోనెవాకిలియు
రాణువలోఁగల రాజులు దొరలు
శ్రేణులై యున్న లక్ష్మీవిలాసంబుఁ
జినచల్వరాతిచేఁ జెలఁగి సింగంపుఁ
బనివైఖరులఁ గనుపట్టు వాకిలియుఁ
జెంగటి పున్నాగశీతలచ్ఛాయ
రంగైన యచ్యుతరంగకూటంబు
లలితనాకపురీ విలాసగేహంబు
కులగిరిఁ బోలు లాగులచప్పరంబు
కవివర్ణనీయమా గరడికూటంబు
నవరత్నమయమైన నాటకశాల
మదనావతారుఁడై మన్నారుఁ డున్న
మదనగోపవిలాసమందిరాంగణము
పట్టాభిరాముని భావచిత్రంపు
గట్టి బంగారు చెక్కడపుఁ జప్పరము
నీలంపుచాయలు నీడలు దేరఁ

జాల విప్పి యొప్పు చల్వరాజగతిఁ
గలిగి రెండవ పుష్పకవిమాన మనఁగ
నలరు శ్రీరామసౌధాధిరాజంబు
విజయచిహ్నములచే వెలయుచునున్న
విజయభవనరాజవేదికాస్థలిని
గంచుకీవర్గంబు కాచియున్నట్టి
కాంచనోదకవాటఘటితమార్గంబు
చంద్రకాంతపు వింత సంతనపనులు
సాంద్రమై విలసిల్లు జగతిమీఁదటను
పగడాల జగడాల బటువుకంబములు
మగఱాల నిగరాల మదనచేతులును
చిన్నారి దంతంపుఁ జేరుళ్లతుదలఁ
జెన్నార మలచిన చీనపత్తులును
పైగోవకెంపుఱాపనుల బోదియలు
బాగైన పచ్చఱాపలకపైకప్పు
ఇంద్రనీలంబుల నెసఁగు లోవరియుఁ
జంద్రికల్ వెదచల్లు చలువగోడలును
కళుకుల రావిరేకుల తోరణములు
చలువనిగ్గులు దేఱు సన్న......
సొగసైన కిట్టాణి సోగముత్తెముల
జిగి మించఁ గనుపించు చికిలి కుచ్చులును
తగిన వైడూర్యంపు దారబందములు
మగఱాల సంతన మడతతల్పులును
జాళువాపనినూఁగుసజ్జలగములు
మేలైన పటికంపు ఘొటికలు గలిగి

కదనంబులోఁ జోళగని గెల్చినట్టి
పొదలికల్ నేపాళ భూపాలకునకు
దొరతనం బిచ్చిన దోర్విలాసములు
దురములో నల పాండ్య తుండీరపతులఁ
జేరి గెల్చిన గెల్పు సింహాసనమున
నారామదేవరాయల నిల్పుటయును
మొదలైన విజయముల్ ముద్దులు గుల్క
పదరక వ్రాసిన భావముల్ మెఱయ
నిందిందిరాలక యిందిరారమణి
కందళించిన వేడుకలఁ గటాక్షింప
రమణీయమగు నిందిరామందిరంబు
కమనీయ విజయరాఘవవిలాసంబు
మొదలైన గృహరాజములు గల్గి రాజ
సదన మప్పురమునఁ జాల నొప్పారు
నారాజధానికి నధిపతి యగుచు
నారామచంద్రుని యవతార మనఁగ
రాజదేవేంద్రుఁడై రఘునాథశౌరి
రాజాధిరాజు తౌరా యని పొగడ
సర్వసర్వంసహాసామ్రాజ్యభరము
దోర్విటంకంబున ధ్రువముగా నిల్పి
దశరథువిధము మాంధాతరీతియును
శశిబిందుచందంబు సగరునీతగవు
భరతునిగరిమ నాభాగునిబాగు
పురుకుత్సు నుత్సాహమును గల్గి యిట్లు
నాఁటి రాజుల సమున్నతిఁ గాంచి నేఁటి

మేటి రాజుల కెల్ల మేల్బంతి యగుచు
ధరణిపైఁ గృతయుగధర్మంబు నడవఁ
బరమదయాళుఁడై ప్రజలఁ బాలించె
రాజన్యమాన్యుఁ డారఘునాథశౌరి
రాజితంబగు నిందిరామందిరమున
నొకనాఁటి వేఁకువ నుత్సాహ మొదవ
సకియలు మేల్కొల్ప సంతోష మెసఁగ
నిద్దుర మేల్కాంచి నిద్దంపు నిలువు
టద్దంబుఁ గని యిద్ద రయగార్ల జూచి
బంగారు బిందెలఁ బాలు కన్గొనుచు
మంగళప్రదు గరుత్మంతు నీక్షించి
వన్నెమీఱఁగ నుప్పవడమైన పిడప
సన్నంపుఁ బైఠిణీ చలువలు గట్టి
చేరి నారీమణుల్ చేదండ లొసఁగ
నారజంపుటొయార మమరఁగా వచ్చి
కాంచనపాంచాలికానికాయంబు
కుంచె కాళంజి చేకొని సేవసేయఁ
బచ్చుఱాచిలుకల పాదపీఠంబు
హెచ్చైన రత్నాల నెనయు గద్దియయు
మురువైన కట్టాణి ముత్యాల దిండ్లు
సరిగల మెఱుఁగుల జగ్గబారి రొయిఱగు
ప్రతిలేక కనుపట్టు బంగరు సరిగ
ప్రతిమల నునుకుట్టుపని కురాడంబు
తీరై మిటారించు దిరినపసిండి (?)
మెఱుపుల మంచంబుమీఁదఁ గూర్చుండె

పుత్రపౌత్రకళత్రములు చేరి కొలువ
గోత్రారివైఖరిఁ గొలువున్నతఱిని
బిరుదుపాత్రలు విజృంభించి యారాజ
వరునిముందఱ నిల్వ వారిలోపలను
పదచాళిఁ గొనియె రూపవతీవధూటి
కొదలేక పేరణిఁ గొనెఁ జంద్రరేఖ
మిక్కిలికోపుల మెఱవడిఁ జూపి
జక్కిణి వినిపించె శశిరేఖ యపుడు
ననఁబోఁడియగు లోకనాయక(కీ)కాంత
వనజలోచన కీరవాణి లతాంగి
దురుపదకేళిక దరుస(త?)నీకోపు
వరుస నటించిరి వన్నెమీఱఁగను
కొరవంజి శివలీల గుజరాతిదేశి
విరిబోండ్లు కొందఱు వినిపించి రపుడు
ఏణీవిలోచన యింపుగా నొకతె
వీణె వాయించెను వింతరాగముల
మురళి రబాబు తంబుర దండె చెంగు
స్వరమండలంబు రావణహస్త మనఁగ
విలసిల్లు జంత్రముల్ వేర్వేఱఁ బూని
వెలఁదులు కొందఱు వినిపించిరపుడు
భువి మెచ్చ నచ్యుతాభ్యుదయకావ్యంబు
నవరసచిత్రంబు నలచరిత్రంబు
హరువైన పారిజాతాహరణంబు
మెఱవడిఁ జూపు వాల్మీకిచరిత్ర
జానకీకల్యాణ చాటుకావ్యంబు

తా నిర్వహించిన తక్కిన కృతులు
కొందఱు వినిపింపఁ గొందఱు తగిన
సందర్భముల సమస్యలు నేకరింప
నెదుట సంగీత సాహిత్యనాట్యములు
మొదలైన విద్యలు మూర్తీభవించె
నన మించు నల చంచలాక్షుల కెల్ల
గనకాంబరంబులు కరుణించి యొసఁగె
నత్తరి మత్తేభయానలు చేరి
జంతాయితంబుగా జలకంబునకును
పఱపైన బంగారు పలకపీటయును
నెఱతావి చలువ పన్నీటి కొప్పెరలు
తళుకు జీని కడాని తంబుగల్ నిలిపి
జలకంబునకును హెచ్చరికఁ గావింప
గద్దియ డిగ్గి చెంగటనున్న చెలువ
లిద్దఱు కైదండ లిరుగడ లొసఁగ
వే దండ నున్నట్టి వేదండగమన
పాదాబ్జముల రత్నపాదుకల్ చేర్ప
రాజసంబున రతిరాజసన్నిభుఁడు
రాజదేవేంద్రుఁడౌ రఘునాథవిభుఁడు
పల్లవపాణు లిర్వంకలఁ గొల్వ
మెల్లమెల్లన వచ్చి మెట్టియున్నట్టి
పాదుకల్ సడలించి బంగారుపీట
మీఁదఁ గూర్చుండి క్రొమ్మించు తంబుగల
జలజాక్షు లందించు జలముఁ గైకొనుచుఁ
జలువపన్నీట మజ్జన మాచరించి

చేలు దువ్వాటములచేఁ దడి యొత్తఁ
జలువపంచ ధరించి జవ్వాది తావి
సన్నజాదుల సరుల్ చక్కఁగాఁ జుట్టి
1 వన్నెమీఱంగ దువ్వాలువపైఁ జేర్చి
రంగురుమాలు చెరంగులు జాఱ
బంగారు సరిగ దుప్పటి చారిగట్టి
ముద్రికాభరణంబు ముత్యాల యొంట్లు
భద్రమౌ శ్రీరామభద్రతాళియును
ధరియించి నామతీర్థమునకు వచ్చి
తరి నిద్ద రయగార్ల దర్శించి కొన్ని
కక్ష్యాంతరంబులు గడచి శ్రీసతికి
లక్ష్యమౌ లక్ష్మీవిలాసంబుఁ జేరి
పావనంబగు గురుపాదద్వయంబు
సేవించి వారిచే సెలవుఁ గైకొనుచుఁ
గపిలధేనువునకు గ్రాస మర్పించి
కప్పురైన యొక జముకాణంబు మీఁదఁ
జేరి పద్మాసనాసీనుఁడై యుండి
పౌరులు గొల్వ దర్పణముఁ జూచుచును
తిరుచూర్ణరేఖతోఁ దిరుమణి నుదుట
ధరియించి మేన ద్వాదశపుండ్రములను
సవరించి మౌక్తికజపసరం బూని
ప్రవిమలాష్టాక్షరీ పరమజపంబుఁ
గావించి తళుకు బంగరు కమ్మ తమ్మి
పూవుల సకలసంపూర్ణవస్తువులఁ
బ్రకటవైభవ మొప్ప రాజగోపాలు

1. వన్నెమీఱఁగ దూర్వాలు పైనించె రంగులుమార చేరంగులు జార

నరుఁ దిరువారాధనము సాంగముగను
గురువుసానతిరీతిఁ గుతుకంబు మీఱి
నరుదైన భక్తితో నపు డాచరించి
పరమభాగవతులు భాగవతంబు
గరిమ రామాయణ కావ్యంబుఁ జదువఁ
బ్రేమతో వారికిఁ బేరు పేర్వరుసఁ
దామె తాంబూల చందనము లర్పించి
నియమంబు రాణింప నిత్యదానములు
ప్రియపూర్వకంబుగాఁ బెద్దల కొసఁగి
మహిమ నాచార్యుల మంత్రాక్షతములు
సహజసద్భక్తి మస్తకమునం దాల్చి
శిరము పాదము మోవ సేవించి యపుడు
తిరుమాళిగకుఁ బంచి దేశికోత్తముల
నిలువుటద్దం బొక నెలఁతుక దాల్ప
నిలువుటద్దము చెంత నీటుగా నిల్వఁ
దలఁ పెఱింగి కడాని తట్టల సొమ్ము
కందళించిన వేడ్కఁ గరములం బూని
ముందఱ బొక్కసంబులవారు నిల్వ
సంపంగి పువ్వుల సరములు చుట్టి
సొంపు రాణింపఁగా సుప్పాణి గొప్ప
ముత్యాల కుళ్లాయి మోహన లీల
ముత్యపు రావులు మురువుగాఁ బూని
నిద్దంపుఁజెక్కుల నీటులు తేర
పెద్దచౌకట్లులు ప్రియముతోఁ బూని
యవిరళనవకుంకుమాంగరాగంబు

సవరించి వీనుల జవ్వాది నించి
సరిగ ముత్తెపుఁగుట్టు జంటిపై మెఱయ
హారువైన పైఠిణీ యఱచట్టఁ దొడిగి
బంగారు చుంగులు పైమిటారింప
రంగారు పీతాంబరము కటిఁ గట్టి
కంటికింపై మించు కంఠమాలికలు
కంటసరంబునుఁ గడువేడ్కఁ బూని
పచ్చల పదకంబు బవిరి చెక్కడఁపు
హెచ్చు ముత్తెపుఁ దాళి యెదపై నమర్చి
మొలక కెంపులపిడి మొలవంకిఁ జెక్కి
తళుకు వజ్రముల యుత్తరిగలఁ బూని
చెలువైన వజ్రాల చేసరుల్ కెంపు
కళుకుల మెఱపుల కడియముల్ దాల్చి
సరిలేని నవరత్నసంఘ సంఘటనఁ
బురుణింపఁగా బాహుపురులు ధరించి
అకలంక నూత్నరత్నాంగుళీయములు
చికిలి వైడూర్యంపుఁ జేయంబు పూని
పరఁగఁ బాండ్యనృపాల ఫాలపట్టమున
మురువైన నవరత్నములఁ దీర్చినట్టి
బిరుదు పెండేరంబు పెరిమ దీపింపఁ
జరణాంబుజంబున సవరించి యిట్లు
కొలువు సింగారమై కోటికందర్ప
లలితలావణ్యవిలాసంబు మెఱయ
రమణమై కొలువున్న రఘునాథశౌరి
సమయంబుఁ గని యవసరములవారు

శక సింధు గాంధార సౌవీర చేర
కుకుర కాశ కరూశ కోస లావంతి
నేపాళ పాండ్య తుండీరాది సకల
భూపాలకులు మిమ్ముఁ బొడగనఁ గోరి
కాచియున్నా రదె కల్యాణశీల
మీచిత్త మని వారు మెల్లనఁ దెల్ప
పెరిమతో వారలఁ బిల్పించి యపుడు
కరుణాకటాక్ష వీక్షణమునఁ జూచి
వినయంబుతో వారు వేర్వేఱఁ దెలుపు
మనవులు పాలించి మహనీయమహిమ
దీపింప భూలోకదేవేంద్రుఁ డనఁగ
భూపాలచంద్రుఁ డొప్పుచునుండె నపుడు
అని హేమకమలాసహాయుని పేర
ఘనఘనాఘననీలకాయుని పేర
సత్యభామాభీష్టసంధాయి పేర
దైత్యభేదన వినోదవిధాయి పేర
దక్షిణద్వారకాస్థలవర్తి పేర
లక్షణాలోలలీలామూర్తి పేర
ఆభీరభీరుమోహనశీలు పేర
గోభిలమునిపాలి గోపాలు పేర
నంకితంబై సుశబ్దార్థమై ఖరికి
నంకితమై కవిశ్రావ్యమై వెలయు
శ్రీరాజగోపాలసేవానిరూఢ
సారసారస్వత సౌభాగ్యశాలి
చినచెవ్వ యాచ్యుత క్షితిపాలవంశ

ఘనవాహనారామకల్పభూరుహము
వర్ధిష్ణు రఘునాథ వసుమతీనాథ
మూర్ధన్య నవసుధాంబుధి సుధాకరుఁడు
శ్రీమత్కళావతీ సీమంతవతికి
నోములపంటయై నుతికెక్కు మేటి
జనవిలక్షణ సలక్షణ చతుర్వేద
జనవిచక్షణ గుణ స్తవనీయచర్య
దీక్షావిధి నయ వైదిక మంత్ర తంత్ర
దక్షిణాసాంగ శతక్రతుయాజి
తిరుమల శ్రీతాత దేశికాదేశ
పరమోపదేశతత్పరమానసుండు
తనతండ్రియే కులదైవ మటంచు
ననిశంబుఁ గొల్చు మహారాజయోగి
శతసహస్రాదిక సకుటుంబవిప్ర
సతతాన్నదాన దీక్షాధురంధరుఁడు
ప్రతివర్షవిహితహిరణ్యగర్భాది
వితతమహాదానవిద్యావినోది
బంధుర రణశూర పాండ్య తుండీర
గంధసింధురరాజకంఠీరవుండు
జీర్ణకర్ణాటక సింహాసనంబు
పూర్ణంబు.......(జేసిన?)పురుషరత్నంబు
అష్టభాషావిశేషాభిజ్ఞసుకవి
పుష్టి దాన నిదాన భోజభూజాని
కమనీయ రుక్మిణీకల్యాణముఖ్య
సమధికనాటక సంవిధాయకుఁడు

మహనీయ పద పద్య మంజరీ ముఖ్య
బహుళప్రబంధనిబంధనశాలి
తడయక పదియాఱు దానంబు లొక్క-
గడియలోఁ జేసిన ఘనదానపరుఁడు
అవని చంపకవల్లి కాభిధానమున
వివిధాగ్రహారముల్ వెలయించుమేటి
నవరసికులకెల్ల నాయకుండైన
కవిరాజు విజయరాఘవ మహీవిభుఁడు
పలుకు చిల్కలకొల్కి పైతిణీచలువ
జిలుగుఁ బయ్యెద విదల్చిన రువారమున
వరవచోరచనల వాసనల్ గులుక
సిరి దేనె లొలుకఁగా విరచించినట్టి
నవ్యమౌ రఘునాథనాయకాభ్యుదయ
కావ్యరాజమునందుఁ గవులు వర్ణింప
మధురస మధుర సుమధుర సురోక్తి
నధికమైతగుఁ బ్రథ మాశ్వాస మయ్యె.

రఘునాథనాయకాభ్యుదయమునందు

ప్రథమాశ్వాసము సమాప్తము.

---



# రఘునాథనాయకాభ్యుదయము

## ద్వితీయాశ్వాసము

శ్రీకరశుభగాత్ర చిత్రచారిత్ర
వైకుంఠధామ దైవతసార్వభౌమ
సాధురక్షణదక్ష సరసీరుహాక్ష
రాధికారతిలోల రాజగోపాల
భువనత్రయాకల్ప భుజగేంద్రతల్ప
అవధరింపుము దేవ యతులప్రభావ
పేరోలగంబుండి పృథివీశుఁ డంత
స్వారివోవఁగనున్న సన్నాహ మెఱిఁగి
కాలమేఘము నీలకంఠుండు బురుడ
నీలాద్రిపవనమానికరావు హనుమ
రామచంద్రుండును రణవిజయుండు
రామబాణంబును రాజసింహంబు
మొరసరగండండు ముద్దుమురారి
గరుడాద్రి విష్ణుచక్రంబు హాలాది
మొదలైన యేనుఁగుల్ ముస్తీదుచేసి
యెదుట నిల్పఁగ వాటి కెక్కుడై జగతి
నైరావతసమానమై ప్రకాశించు
నైరావతంబను నల భద్రగజము
గుంపైన పచ్చల గుజరాతిజాతి
కెంపుల బవిరిఁ జెక్కిన కొమ్ముకట్లు

వెల హెచ్చు నీలాల వేడెంపుఁబనుల
తళుకు వజ్రమ్ముల తలమాళిగయును
మొలకవెన్నెల లీను ముత్తెపుసరులుఁ
జెలువై మిటారించు చెవుల జల్లులును
ఘనమైన పుష్యరాగపు చెక్కడమునఁ
గనుపట్టు ఫాలాది గంటల బారు
మరకత వైడూర్య మాణిక్యరుచుల
వఱలుచున్న యురస్త్రి వాలత్రములును
హురుమంజిముత్యాల యొరిజతో నంటి
మెఱయు వైడూర్యంపు మెడగంట గొలును
ప్రతిలేని కెంపుజారావిరేకలును
రతనాల పని మించు రవలయందియలు
సరిగబొమ్మలకట్టు చాలఁ గన్పట్టు
మెఱుఁగుల నునుపట్టు మేలిమి జూలు
ముత్తియంపు బవంతి ముద్దులు గులుకు
క్రొత్త సూరెపుటంపు గుఱుచగద్దిగము
మొదలైన సవరణ ముస్తీదుచేసి
యుదిరి బంగరు బాఁయును జేతి కిచ్చి
తగిన యంగి ధరించి తలపాగఁ జుట్టి
మగఁటిమిఁ గలయట్టి మావంతుఁ డపుడు
పావలయొల్లు చేఁబట్టి ముందఱను
దా వేడ్కతో నెక్కి తనవెన్క నున్న
చిఱుతమావంతుండు చికిలి బంగారు
మెఱుఁగు డాల్ గైకొని మెఱవడిఁ జూపఁ
దెచ్చిన భూలోకదేవేంద్రుఁడైన

అచ్యుతరఘునాథుఁ డటుఁ గటాక్షింప
నాసన్నుఁ గైకొని యాసన్నమైన
నాసరుం డంతట నాగజం బనుపఁ
జటులవాగ్వైఖరి సముఃఖా యటంచుఁ
గటికవారలు పల్కఁ గద్దిగ డిగ్గి
చెంగటి సరిదొరల్ చేదండ లొసఁగ
బంగారు సపసాచప్పరములో నిలిచి
భద్రలీలల రామభద్రుఁడో యనఁగ
భద్రగజేంద్రంబు బాగుగా నెక్కి
కులుకుచ యేనుఁగుల్పైఁ గూర్చున్నవార
లొరిజలోఁ బాదంబు లొయ్యనఁ జేర్ప
వజ్రంబుఁ గైకొన్న వజ్రిచందమున
వజ్రాంకుశము తన వలకేలఁ బూని
తీరైన తళుకు ముత్తెపుఁ జెండుఁ దాల్చి
శ్రీరామభద్రుని సేవించి యపుడు
చంద్రమండలకాంతి సంతతి మించు
సాంద్రముక్తాఫలచ్ఛత్రంబు మెఱయ
రహిమించఁ గనుపించు రత్నదండముల
మహిమచేఁ దనరు చామరములు వీవ
బంగారు పూవుల బాగుగా మించు
చెంగావి పావడల్ చెంగట మెఱయ
నాగసరంబులు నరగజమ్ములును
బాగైన తమ[టముల్*] బసిఁడికాహాళలు
డవిణలు భేరులు ఢక్కాదులైన
వివిధవాద్యంబులు వేర్వేఱ మొరయ

నేల యురిమినయట్టు నిండె భూస్థలిని
ఆలోన శ్రుతులు ఘుమ్మని మ్రోయ నెదుటఁ
జిఱుతమద్దెలయును జెంగును దండి
మెఱయఁగా సంగీతమేళంబుఁ దనర
సమదపాండ్యనృపాల సప్తాంగహరణ
సమరవిక్రమరమాసంపన్న యనుచు
వందిమాగధు లిరువంకలఁ జేరి
యందందఁ గైవార మమర సేయఁగను
అచ్యుతనామాంకితాగ్రతనూజుఁ
డచ్యుత రామభద్రావనివిభుఁడు
మొదలైన తనయులు మువ్వు రవ్వేళఁ
బొదలి మూర్తిత్రయంబో వీర లనఁగఁ
బ్రభుశక్తి మెఱయ భద్రగజమ్ము లెక్కి
యుభయ పార్శ్వంబుల నొరపుగాఁ గొలువ
మకరధ్వజంబులు మత్స్యకేతువులు
పికిలిపూవులసరుల్ పింఛలాంఛనము
సురమాయి జల్లుల సూర్యచంద్రులును
గరుడధ్వజంబును గండభేరుండ
మాదిగాఁ గల బిరుదాంకముల్ మెఱయ
వేదండముల నెక్కి వే దండ మెఱయ
రాజులు దొరలును రాజిల్లుచుండ
రాజమార్గంబున రాజసం బమర
రారాజురీతి నారఘునాథశౌరి
స్వారిగా వచ్చుచో సంభ్రమంబునను
గొప్ప యుప్పరిగల గోపురమ్ములను

జప్పరమ్ములఁ బైఁడి సజ్జపజ్జలను
వీథుల నెలతాల వింతసంతసల
వేదుల నిలిచి యవ్వీటి జవ్వనులు
కన్నులపండువుగాఁ గనుంగొనుచుఁ
గన్నియలార యీగాంభీర్యశాలి
కంతుఁడో యల రమాకాంతుఁడో యాజ
యంతవసంతులయం దొక్కరుండో
కాకున్న నింత చక్కఁదనంబుఁ గలుగు
రాకుమారులు గలరా ధరాస్థలిని
అని పౌరకాంత లంతంతట నిలిచి
జనపాలుమీఁద సేసలు చల్లి రపుడు
వారిలోపల నొక్కవనితాలలామ
మేరుసమానమౌ మేడపై నుండి
యన్నరేంద్రుని రాక కచ్చెరువంది
పున్నమచందురుఁ బోలు నెమ్మోము
వెలిదామరల నేలు వెడఁద కన్నులును
దళుకులు దేఱు నిద్దంపు చెక్కులును
సురశాఖిశాఖల జోడైన భుజము
లరుణాబ్జముల మించు హస్తయుగ్మంబు
పాంచజన్యమురీతిఁ బరగు కంఠంబు
గాంచనోరుకవాటగతి మించునురము
సైకతస్థలికన్నఁ జదురైన జఘన
మాకరికరముల నదలించు తొడలు
లలితమహోరాజలక్షణమ్ములను
జెలువారు పాదరాజీవయుగంబు

మొదలైన యవయవమ్ములచేతఁ దనకు
ముదమొదవించు నమ్మోహనాకారు
మదనావతారు నామన్నెహంవీరుఁ
గదలక జాలమార్గమ్మునఁ జూచి
సంతసంబును మహాశ్చర్యంబు నొంది
యంతరంగమున నిట్లని వితర్కించె
నింతటివాని నే నెందును గానఁ
గంతుఁ డిమ్మేదినీకాంతుని కెనయె
చక్కనివారిలోఁ జక్కనివాఁడు
చొక్కరె యీతనిఁ జూచిన చెలులు
అని తెప్పవేయక యందందుఁ జూచి
మనమున హర్షించి మఱియు నిట్లనియెఁ
బ్రేమతో నీరాజబిగువుకౌఁగిటను
వేమాఱు మరుకేళి విహరించు చెలులు
ఏనోము నోచిరో యేదైవములను
బూని పూజించిరో పూర్వజన్మమున
నీరాజకందర్పుఁ డింపుసొంపారఁ
జేరరమ్మని పిల్చి చేపట్టి నన్ను
మోము మోమునఁ జేర్చి మోవి యానుచును
బ్రేమతోఁ గౌఁగిటఁ బెనఁగు టెన్నటికి
తళుకుచెక్కిలి నొక్కి తమిమీఱ సొక్కి
యెలమిఁ బుక్కిటి విడె మిచ్చు టెన్నటికి
కురులు నున్నగ దువ్వి కొప్పమరించి
విరులు దిండుగఁ జుట్టి వేడుకమీఱఁ
గలపంబు నెమ్మేనఁ గలయ నలంది

తిలకంబుఁ గొనగోరఁ దీరుగా దిద్ది
కళ లంటి సోకించి కరఁగించి కరఁగి
కులుకుగుబ్బలఁ జేటి కూడు పెన్నటికి
అను పల్కు పల్కి మోహాతిశయంబు
గనుపట్టఁగాఁ బులకలు జాదుకొనఁగ
పొరిఁబొరి హర్షాశ్రుపూరముల్ దొరఁగఁ
బరవశమైయున్న భావంబుఁ దెలిసి
కొక్కోకములఁ జాల గుఱిపడ్డరౌతు
చక్కెరఖాణంపు సామ్రాణి నెక్కి
యంచెలనున్న రాయంచబోదలను
జంచరీకమ్ములఁ జలువ తెమ్మెరల
గొరవంకలను గండుగోయిలగముల
నిరువంకఁ బుఱికొల్పి యింతిపై నపుడు
కండచక్కెరవిల్లు కరమునఁ బట్టి
గండుతుమ్మెదనారి గట్టి మోపెట్టి
అలరులఁ గన్నెరాకమ్ము సంధించి
కులుకుగుబ్బెత నేసి కోయని యార్చి
యీ తెఱంగునఁ దూపు లేసి మన్మథుఁడు
నాతిమర్మోద్ఘాటనంబుఁ గావింపఁ
జేరువనున్న నెచ్చెలికత్తె లెఱిఁగి
యారామఁ దోడ్కొని యారామమునకు
వేవేగ వచ్చి యా వెలఁదికి నపుడు
భావజసంతాపభరము మాన్పుటకుఁ
బుష్పాపచయమునఁ బ్రొద్దుపుచ్చుటకుఁ
బుష్పవనాంతరంబునఁ జరింపుచును

బొన్నలుఁ బొగడలు బొండుమల్లియలుఁ
గన్నెగేదంగులుఁ గలువపువ్వులును
సన్నజాదులుఁ దావి సంపంగివిరులుఁ
బన్నీటివిరులు సేవంతిపూవులును
మొదలైన కుసుమసమూహంబు లెల్లఁ
జిదిమి బంతులసరుల్ చెండ్లుగాఁ గట్టి
కలకంఠకంఠికిఁ గాన్క కావింప
వలచి వల్లమి సేసి వనవీథియందుఁ
జిగురుటాకులు మెక్కి చెలఁగి యామెక్కి
డగరకోయిలలు మిటారించి పలుకఁ
గూర్మితో నాగండుగోయిలగుంపు
కార్మొగుళ్లని నీలకంఠంబు లాడ
సాంద్రమహా నానెమ్మిచాలుక్రాల్ చూచి
యైంద్రచాప మటంచు నంచలు కలఁగ
నారాజహంసపక్షాననద్యుతులు
నీరంధ్రచంద్రికల్ నీరెండ లనుచు
సారె సారె చకోర చక్రదంపతులు
కూరిమితో జోడుఁ గూడి క్రీడింపఁ
కలికి మాటికి వాటి కలయికల్ చూచి
వలపెక్కి సొక్కి భావజుఁబారిఁ జిక్కి
చిలుకలదాడికిఁ జెఱకువిల్కాని
ములుకులవాడికి ముఖవాసనలకుఁ
జేరెడు తేఁటికిఁ జెంగటనుండి
దూఱెడుబోటికిఁ దులదుల వచ్చు
వలపులగాలికి వలపుపై వలపుఁ

గొలుపు విరాళికిఁ గుంది లోఁ గంది
గట్టివావలరాచకాఁకలఁ దెరలి
నిట్టూర్పు నిగుడించి నెమ్మోము వాంచి
జలజాక్షి యున్నచో జాఱుగొప్పునను
జలజలఁ గ్రొవ్విరుల్ జల్లన రాల
వలరాయఁ డేసిన వాలమ్ము లనుచుఁ
దలగడమీఁద హస్తముఁ జేర్చి యొఱగఁ
గంకణంబులు ఘలుఘల్లని మ్రోయ
శంకించి తాఁ గోరు జనపాలవరుని
చేతి సానాకత్తి చిమ్ములో యనుచు
నాతి దిగ్గన లేచి నలువంకఁ జూచి
కాటుక కన్నీరు కడగంటఁ జాఱ
గోట మీటుచును జెక్కునఁ జెయ్యి చేర్చి
హృదయంబులోఁ జాల హేరాళమైన
మదనవికారంబు మఱుపెట్టలేక
లలనాశిరోమణి లజ్జాభరంబుఁ
దొలఁగించి నేను కంతునిచేతఁ జిక్కి
యీచందమునఁ గుంద నింద ఊరకయ
చూచుచున్నారఁటే శుకవాణులార
అను పల్కు పల్కి యాయరవిందనయన
తనువెల్లఁ బరవశత్వంబు వహింపఁ
బ్రియుఁడు వచ్చె నటంచుఁ బ్రేమతో లేచి
బయలు కౌఁగిటఁ జేర్ప బాలికామణులు
కరముఁ జెక్కిటఁ జేర్చి కటకటా చెలికి
విరహతాపం బింత వెగ్గలం బానె

గురుకుచంబులమీఁది గొప్ప ముత్తెంపు
సరు లింద్రనీలంపు సరు లయ్యె నకట
ఘనసారపూరిత గంధసారంబు
కనకాంగి నెమ్మేనఁ గస్తూరి యయ్యె
నీవి వీడఁదొడంగె నిగరంపుకెంపు
మోవి వాడఁదొడంగె మోము సెమర్చె
నీమందగమన నేఁ డిట్లున్నచంద
మేమంద మేమంద మేమందఱమును
శిశిరోపచారముల్ సేసినఁగాని
శశిముఖి మైకాఁక చల్లార దనుచుఁ
జంపకగంధులు చలువలు దేఱు
సంపంగివిరి గొప్ప చప్పరంబునను
దెలినిగ్గు కపురంపుఁ దిన్నెఁ గావించి
చలువచెంగలువ మంచముపై నమర్చి
పరపుగాఁ బుప్పొడి పఱపుఁ గావించి
పరువంపుఁ [బూ*]దిండ్లు బటువుగాఁ జేర్చి
పడఁతుక నప్పు డప్పాన్పుపై నునిచి
కడుదట్టముగ మలాకాగంధ మలఁది
పన్నీరు పైఁ జల్లి పరువంపుఁదావి
పన్నీటి విరుల దుప్పటి మేనఁ గప్పి
చిగురాకు పావడ చెంగల్వసురటి
తగిన కాంతలతాంతతాలవృంతంబు
కురువేరు జొంపపుఁ గుంచియుఁ బూని
గురుకుచముందఱఁ గొందఱు వీవ
హరిణాక్షికి మృణాళహారముల్ వైచి

కరములఁ గపురంపుఁ గడియముల్ పూన్చి
యొనరఁ బుప్పొడిగందపొడి మేన నించి
యెనయఁగా ధూపంబు లిరుగడ నిలిపి
యీరీతిఁ జలువ లెన్నేనియుఁ జేయ
నారమణికి కాఁక యగ్గలంబయ్యెఁ
జెలిమేనిగందంబు చిటిలి పైఁ బడినఁ
గలఁగి యంగనల యంగము చుఱుక్కనియెఁ
జెలియకుఁ గప్పిన సేవంతి చలువ
కలువల చలువయై కనుపట్టె నపుడు
శాంతిఁ బొందక కంతు సంతాప మిట్లు
కాంత కంతంత కగ్గలమైనఁ జూచి
చెలులార మనము చేసిన చల్వ లెల్లఁ
గలికి తాపముఁ దీర్పఁగాఁజాలవయ్యె
చెఱకువిల్తుని పూజ సేయక మనము
పాఱఁదోలంబోవఁ బోవునే కాఁక
అని నిశ్చయించి వా రంద ఱచ్చెలిని
గనికరంబునఁ జేరి కనికరంబునను
జాఱుఁబయ్యెద కొంగు సవరించి గోర
సారెకు నెఱికురుల్ చక్కఁగాఁ దీర్చి
యక్కునఁ జేర్చి యూరార్చి యో యమ్మ
చక్కెరఖాణంపు సాంబ్రాణిదారను
నేఁడు పూజింపుమా నీమనోరథము
లీడేర్చు నతఁడు నీ కేల చింతింప
ననిమందలించి నెయ్యము కందళింప[1]
ఘనసారకదళికాకాంతారమునను

1. ...దళించి నెయ్యము కందళింప

పరపైన ద్రాక్షచప్పరములోపలను
విరివియౌ పుష్పాడివేదియమీఁద
కమ్మదామర ముద్దెగద్దియపైని
ఘుమ్మను మొగలిరేకుపటంబు నిల్పి
బాలికల్ మృగనాభిపంకంబులోన
వాలారుఁ గొనగోరు వాగఱ నద్ది
రతిమన్మథుల వ్రాసి రతిరాజుచెంత
ఋతురాజు రేరాజు నిరుగడ వ్రాసి
వారికిఁ జుట్టును వలికరువలిని
గీర మయూర కోకిల మరాళముల
పలకల లిఖయించి భజనకుం దగిన
ఫలజలకుసుమాదిబహువిధవస్తువులు
జీని తట్టల నించి చెంగట నుంచి
యానీలకుంతల నటకు వేఁడెచ్చి[1]
మదనునియెదుట సమ్మదమున నిల్పఁ
బదరక యాచిత్రపటము నీక్షించి
కనకాంగి యొకవిరిఁ గరమునఁ బూని
ననవిల్తు నావాహనంబుఁ గావించి
తావులు వెదచల్లు తళుకుకెందమ్మి
పూవుగద్దియ యిదె పుష్పకోదండ
యాచరించెదను నీ కర్ఘ్యంబు పాద్య
మాచమనీయంబు నభిషేక మిదియె
విరుల దుప్పటి యిదె వెడవింటివేల్ప
హరిచందనం బిదె యంగజ నీకు
మంచి పూసరు లివె మన్మథ నీకు

1. యానీలకుంతల నటకు దెచ్చుటయును

మించిన సామ్మిదె మీనాంక నీకు
ధూపదీపము లివె తుంటవిల్ రాయ
యీపక్వఫల మిదె యిందిరాతనయ
నీరాజనం బిదె నీరజబాణ
కీరవాహన యిదె కేలు మోడ్చెదను
మఱవకు మమ్మని మరువమ్ము లెత్తి
హరిణాక్షి యపుడు పుష్పాంజలి యొసఁగి
కేసరివిక్రమక్రీడలవాని
నీసరి......నృపశిఖామణిని
రాజుల రాజైన రఘునాథవిభుని
యోజనమీఱ నేఁ డొనఁగూర్పు మనుచుఁ
బతిఁ గూర్చునట్టి యుపాయంబుఁ గోరి
యతిభక్తితో నుపాయనదాన మొసఁగి
భావజార్పితపరిపక్వఫలంబు
లావనాంతరసద్ద్విజావళి కొసఁగి
పచ్చవిల్తునిఁ జాలఁ బ్రార్థన సేయ
మచ్చెకంటికిఁ గాఁక మఱియును హెచ్చె
హెచ్చిన కోపంబు హేరాళమైనఁ
బచ్చవిల్తునిఁ జూచి భామ యిట్లనియె
భావజ మాపూజఁ బాలింపవైతి
పీవనంగుఁడవౌట నేర్పడె నెందు
నింతుల నేచుచు నేవేళ నీవు
మంతనంబునఁ జాల మాన్యుండవైతి
గాని విక్రమశక్తిఁ గలవాఁడవేని
నీనేర్పు లెటు వోయె నిటలాక్షునెదుట

మలయజగంధుల మలఁగఁ జేసెదవు
మలయమారుత యెంత మందుఁడ వీవు
పక్షపాతముఁగల బలగంబు లనుచు
రక్షింతుగా మిమ్ము రాచిల్కలార
ఇక్షుశరాసనుం డేఁచువేళలను
పక్షపాతము లేక పలుకుట తగవె
యనుచుఁ గందర్ప మందానిలంబులను
మనసిజు బలముల మాటికి దూఱి
యేమి సేయుదు నింక నేవేల్పుఁ గొల్తు
నేమలయజగంధి నేను బ్రార్థింతు
నారాజకందర్పు నారాజచంద్రు
నారాజదేవేంద్రు నామహారాజు
సమయంబుఁ గనుఁగొని సముఖంబుఁ జేరి
మమతతోడుత నాదు మనవు లాతనికిఁ
దెలిపి యెవ్వరు తోడి తెచ్చెద రనుచు
నెలఁతుక బొటవ్రేల నేల వ్రాయుచును
అటు నిటుఁ జూచుచు నక్కటా దైవ
మిటువలె సేయునే యేమందు ననుచు
విన్నఁదనంబున విరహాబ్ధి మునిఁగి
యున్న నెచ్చెలిఁ జూచి యువిద లిట్లనిరి
చిలుక తేజీయఁట చెఱకఁట విల్లు
బళి బళి తుమ్మెద బారఁట[1] నారి
చెంగల్వవిరులఁట చికిలి[2] వాలమ్ము
లఁగంబు లేనివాఁడట యేటుకాఁడు
ఆయమ్ము లెవ్వారి యాయమ్ము నాటె

1. వాజట. 2. చిలుక

నోయమ్మ యిటువంటి యూహాలు గలవె
అని తన వల పెల్ల నాఱడిసేయు
వనితలఁ జూచి యావాల్గంటి పలికెఁ
జెఱకుసింగిణి జాఱఁ జెఱకు లోనగుట
సరకుసేయక నన్ను సారెకు మీరు
ఇంగితం బెఱుఁగక యీలాగు వల్క
నంగనామణులార యర్హమా మీకుఁ
జిన్ననాఁ డాదిగాఁ జెలిమితో మీర
లున్నవా రని యెంచి యుండితిఁ గాని
వే ఱొక రందురో యిందునో నేను
మీ రొక చెలులఁటే మేదినీధవుని
కడకు మి మ్మంపితేఁ గార్య మీడేర్చి
నడతురో యేలాగు నడతురో కాని
అని పల్కి వారల నందఱఁ బనిచి
మనసిజసంతాపమగ్నయై యపుడు
సరసిజేక్షణ యొకచలువసంపంగి
తరువునీడను నిల్చి తనలోనఁ దాను
ఈవనంబున నున్న యిందిందిరంబు
నావిభుఁ దోడితే నంపితినేని
అక్కడి చెలులముఖాబ్జవాసనకుఁ
దక్కక సొక్కక తా నేల వచ్చు
హంసను దూతిగా నంపిన వారి
హంసకధ్వని విని యచటనే యుండు
ఆగండుగోయిల నంపిన వారి
రాగంబు విని యనురాగంబు నొందుఁ

గాన వీటిని బంపఁ గార్యంబు నడవ
దే నెవ్వరిని బంతు నిటమీఁద ననుచు
నాలోలలోచన యంతరంగమున
నాలోచనము సేయ నర్చితుండైన
పంచదారను దిను బాబావజీరుఁ
డించుఁబోఁడియభీష్ట మీడేర్పు మనుచుఁ
బంచిన దూతికభాతిగా నొక్క
పంచవర్ణ శుకంబు భామ చే నిల్చి
అక్కక్క మోవిపం డందియి మ్మనుచు
మక్కువ మాటల మమతఁ బుట్టింపఁ
జొక్కపు రెక్కలు సొగసుగా దువ్వి
చక్కెరఁ గొమ్మని జవ్వని యొసఁగఁ
గలకంఠి యి ట్లేల కందెద వనుచుఁ
జిలుక యప్పుడు ముద్దుఁ జిలుక త న్నడుగఁ
జిలుకలకొలికి యాచిలుకను జూచి
పలికె ని ట్లని తన భావంబుఁ దెలియ
వింత యొక్కటి గంటి వింటివా చిలుక
సంతసంబున నేను సౌధంబుమీఁద
కొమ్మలు కొలువంగఁ గొలువున్నవేళ
కమ్మవిల్కాని చక్కఁదనంబువాఁడు
పూర్ణేందుకళలను బొలుపొందువాఁడు
కర్ణాంతదీర్ఘమౌ కనుదోయివాఁడు
రసికుఁ డాయచ్యుతరఘునాథశౌరి
అసమానవైభవ మమరఁగా నేఁడు
రారాజు మీఱి యారాజమార్గమున

స్వారి రా నింకొక్కసారి రాఁగోరి
కన్నులపండువగాఁ జూచుచుండఁ
గన్నులవిలుకాఁడు కడుఁగాసి సేసి
వేఁడిమిఁ జూప నావెతఁ జూడలేక
తోడిచెలుల్ నన్నుఁ దోడితే నిందుఁ
బలవింపఁగా నాదు భాగ్యంబుకతనఁ
జిలుక వచ్చితివి నా జీవ మిచ్చితివి
ఆదికాలంబున నానైషధునకు
నాదమయంతికి హంసదూత్యంబు
సవరించి కీర్తులు సంతరించుటయు
భువనైకమాన్య యాభోజకన్యకకు
నవనీతచోరు మన్నారుఁ జేకూర్చి
భువి నొక్కద్విజరాజు పొగడొందుటయును
విన్నావు గనుక నావృత్తాంత మెల్లఁ
గన్నావు గనుక నాఘనమైన కాఁకఁ
దీర్చునుపాయంబుఁ దెలుపుమా నీవు
నేర్చిన నేర్పులు నేఁడు చూచెదను
అనిశంబు నావంటి యనుఁగుఁజుట్టంబు
కనకాంగి కలుగంగఁ గలఁగంగనేల
అపరంజి పంజరంబందు ని న్నునిచి
కృపతోడ రతనాల గిన్నెలోపలను
గమ్మని పండ్లు పాల్ కండ చక్కెరయు
సమ్మదంబున నిచ్చి సాఁకితి నీవు
ఇంతకాలంబు న న్నిట్లు పోషించు
టింతి యిప్పటికిఁగా కెప్పటికమ్మ

ననుఁ బంపవమ్మ యానరనాథుకడకు
మనసు రంజిల్ల నీమనవులు తెలిపి
అచ్చుతేంద్రుకుమారు నసహాయశూరు
నిచ్చటి కేఁ దెత్తు నిదె పోయివత్తు
ననుపల్కు చిల్క నందందఁ బ్రార్థించి
మనమున హర్షించి మఱి వీడుకొలిపి
బాలికామణి తన పతిరాకఁ గోరి
జాలిటింట వసించె జాలిఁ బాలించి
అని హేమకమలాసహాయుని పేర
ఘనఘనాఘననీలకాయుని పేర
సత్యభామాభీష్టసంధాయి పేర
దైత్యభేదనవినోదవిధాయి పేర
దక్షిణద్వారకాస్థలవర్తి పేర
లక్షణాలోలలీలామూర్తి పేర
ఆభీరభీరుమోహనశీలు పేర
గోభిలమునిపాలి గోపాలు పేర
లాలించిసామ్రాజ్యలాభవైభవము
పాలించు రాజగోపాలుని పేర
నంకితంబై సుశబ్దార్థవైఖరికి
సంకేతమై కవిశ్రావ్యమై వెలయు
శ్రీరాజగోపాలసేవానిరూఢ
సారసారస్వతసౌభాగ్యశాలి
చినచెవ్వయాచ్యుత క్షితిపాలవంశ
ఘనవాహనారామకల్పభూరుహము
వర్ధిష్ణు రఘునాథ వసుమతీనాథ

మూర్ధన్యనవసుధాంబుధిసుధాకరుఁడు
శ్రీమత్కళావతీసీమంతవతికి
నోములపంటయై నుతికెక్కు మేటి
జన విలక్షణ సలక్షణ చతుర్వేది
జనవిచక్షణ గుణ స్తవనీయచర్య
దీక్షాదినియమ వైదికమంత్రతంత్ర
దక్షిణాసాంగ శతక్రతుయాజి
తిరుమల శ్రీతాతదేశికాధీశ
పరమోపదేశతత్పరమానసుండు
తనతండ్రియే కులదైవ మటంచు
ననిశంబుఁ గొలుచు మహారాజయోగి
శతసహస్రాదిక సకుటుంబవిప్ర
సతతాన్నదానదీక్షాధురంధరుఁడు
ప్రతివర్షవిహితహిరణ్యగర్భాది
వితతమహాదానవిద్యావినోది
బంధుర రణశూర పాండ్య తుండీర
గంధసింధురరాజకంఠీరవుండు
జీర్ణకర్ణాటక సింహాసనంబు
పూర్ణంబు సేసిన పురుషరత్నంబు
అష్టభాషావిశేషాభిజ్ఞసుకవి
పుష్టిదానవిధానభోజభూజాని
కమనీయరుక్మిణీకల్యాణముఖ్య
సమధికనాటకసంవిధాయకుఁడు
మహనీయపదపద్యమంజరీముఖ్య
బహుళప్రబంధనిబంధనశాలి

తడయక పదియాఱు దానంబు లొక్క-
గడియలోఁ జేసిన ఘనదానపరుఁడు
అవనిఁ జంపకవల్లికాభిధానమున
వివిధాగ్రహారముల్ వెలయించు మేటి
నవరసికులకెల్ల నాయకుండైన
కవిరాజు విజయరాఘవమహీవిభుఁడు
పలుకు జవ్వనిమోవి పంచదారలను
దిలకించు తీయని తేటమాటలను
కమనీయనవరసగర్భసందర్భ
విమలవైఖరి మించ విరచించినట్టి
నవ్యమౌ రఘునాథనాయకాభ్యుదయ
కావ్యరాజమునందుఁ గవులు వర్ణింప
సారశృంగారరసప్రసంగమున
నారూఢమగు ద్వితీయాశ్వాసమయ్యె.

రఘునాథనాయకాభ్యుదయమునందుఁ

ద్వితీయాశ్వాసము సమాప్తము.



శ్రీ

# రఘునాథనాయకాభ్యుదయము

## తృతీయాశ్వాసము

శ్రీచంపకవనీశ త్రిజగత్ప్రకాశ
ఖేచరస్తుత చారుకీర్తిసంసార
నిజభజనోపాయ నియమస్థారేయ
విజయరాఘవధీర విహితోపచార
భోజకన్యాముఖాంభోజమరాళ
రాజితగుణశీల రాజగోపాల
అచ్యుతరఘునాథుఁ డంత నక్కడను
విచ్చలవిడి స్వారి విచ్చేసి మరలి
చతురంగబలములు సరసఁ గొల్వంగఁ
బ్రతి లేని యాహజారముఁ జేరవచ్చి
కరులమీఁదనె యుండి కరములు మొగుచు
కురిరాచకొమరులఁ గొందఱఁ బనిచి
భద్రగజేంద్రంబుపై నున్నయట్ల
భద్రశాలను రామభద్రు సేవించి
సరగ లక్ష్మీవిలాసముఁ బ్రవేశించి
చరణసంజ్ఞను గరి సరుదుకుఁ జేర్చి
చనవరు లగుదొరల్ సరసకుఁ జేరి
ఘనభయభక్తులఁ గైదండ లొసఁగ
నపుడు భద్రగజేంద్ర మచ్చట డిగ్గి
యపరంజి మెఱుఁగుల పాదిగల నీడఁ

జక్కఁగా నెరరాజసంబున వచ్చి
యక్కడి రంగనాయకుల సేవించి
కైలాగు జతనంబు కల్యాణశీల
మేలుప్పరంబు గాంభీర్యసముద్ర
దాటవదానంబు ధరణీశ యనుచు
నాటోపమున వేత్రహస్తులు పలుక
శ్రీరామసౌధంబుచెంత నున్నట్టి
యారాజగోపాలు నపుడు సేవించి
పరపైన చల్వతాపలకమీఁదటను
పఱచిన తావికెంబట్టు గద్దిగను
ఆసీనుఁడై యుండి యసమువారలను
జేసన్నఁ గొందఱ సెలవిచ్చి పంపి
సరసవిద్వత్కవిసార్వభౌములను
సరసకు రప్పించి చాల లాలించి
కొంతసేపు కవిత్వగోష్ఠితో నుండి
యంతట వారికొల్వైనపిమ్మటను
బైఠిణీయంగులు బఱువుపాగలును
గాటంపు బంగారు గంటపుటొరలు
పరరాణువులనున్న ప్రముఖులు బంప
వెరవరులైనట్టి వేగులవారు
దినదినంబును దెచ్చు దినసరుల్ పూని
చనవరులగు రాయసంబులవారు
నగరికి నాప్తులైన మజాలశీలు
నిగనిగల్ వెదచల్లు నిమ్మపం డ్లపుడు
కరములఁ బూనికై కానుకల్ సేసి

గరిమతోఁ జేతులు కట్టుక నిల్వఁ
దెలుపుఁ డేమైనను దిక్కులకార్య
ములు వ్రాసి వచ్చెనా మొన్న నిన్నటను
అన విని మీయాజ్ఞ యాదలఁ దాల్చి
కనుసన్న మెలఁగుచుఁ గప్పముల్ కట్టి
దినదినంబును మిమ్ము దేశాధిపతులు
కని మఱిఁ గొల్వఁగాఁ గార్య మెక్కడిది
పడుమట తోపూరి పాళెంబులోన
నడచిన సమరసన్నాహంబు లెల్ల
విని పాదుశాలు మీవిజయోత్సవంబుఁ
గొనియాడి తమ వగగుఱిమనుష్యులను
బనిచినారని వారి పజ్జ నున్నట్టి
మనవారణప్ప యా మర్యాదలెల్ల
వ్రాయించి తన విన్న పత్ర మంటించి
చాయఁగా వినుఁడని చదివి రిట్లనుచు.
అని విన్నవించి కార్యాంశముల్ దెలియ
దినసరుల్ చదివిరి తేటపడంగఁ
గుళ్ళాయిపైఁ బాగ కుదురుగాఁ జుట్టి
యొళ్ళలోఁ గడితంబు లొప్పుగా నునిచి
సారెకు మణియంపు చడితముల్ పూని
తారసంబుగ వివాదములు సేయుచును
యాయవ్యయంబుల కన్యోన్యచింత
సేయుచుఁ గరణికుల్ చెంగట నిల్చి
మనువర్తి లెక్కయు మణియంపు లెక్క
వినుపింప విని వారి వీడ్కొల్పి యపుడు

మంతనంబునఁ దగు మంత్రులతోడ
నంతరంగమున నేకాంతంబు లాడి
యంతఃపురద్వార మటు చేరి నడువ
కాంత లిద్దఱు చేరి కై దండ లొసఁగ
బంగారు తంబుగ పన్నీటిచేత
నంగనామణులు పాదాబ్జముల్ గడుగ
ముదిత యొక్కతె పాదములు తడియొత్త
నుదిరి కాళంజి వే ఒకతె ధరింప
సకియ వే ఒక్కతె చలువ పన్నీటి
చికిలి బంగరుగిండి చేతి కందీయ
ధరణీతలేంద్రుండు తాంబూల మపుడు
పరిహరించి ప్రసూన పరిమళమిళిత
మధురోదకముల ముమ్మాఱుఁ బుక్కిలించి
యధరంబుఁ బావడ నటు తడియొత్తి
రాజసంబున నిందిరామందిరమున
రాజిలు రాజ్యేందిరకుఁ గేలు మొగిచి
వరరత్నకీర్ణమై వర్ణిం..........
.........నాఁబోతు లమరించినట్టి
ధవళారుణాసితౌదనకుంభములును
వివిధాం..................
వెంపరాజకుమారి విఖ్యాతి మీఱి
సంపంగి మన్నారు సద్భక్తుఁడైన
విజయరాఘవ............
......................
.........మకళావతీ సాధ్వి

......................
చెలులు గొల్వఁగఁ బతి చెంగట నిల్చె
విశ్వనాథునిపేర విభుపుత్రియగు.
................యపుడు
తనచెలుల్ గొల్వఁగా ధవుచెంత నిలిచె
పాండిత్యశాలిని బయ్యపనె......
.........లాక్ష్మాంబ యపుడు
వెలఁదులు గొల్వఁగా విభుచెంత నిలిచె
గారవమ్మున ది................
యెలమి నల్లుని చేంకటేంద్రుని తనయ
వెలఁదుల మేల్బంతి వేంకటమ్మయును
చివురుఁబోణులు తమ చేతి కందిచ్చు
నవరత్ననీరాజనము లిచ్చి రంత
నిలువుటద్దం బొకనెలఁత ధరింప
తలిరుఁబోణులు చవి తట్టలఁ బట్టఁ
గడువేడ్కఁ గొలువుసింగారమ్ము సొమ్ము
సడలించి సరిగంచు చలువలు గట్టి
చిన్నారి యొంట్లును శ్రీరామతాళి
సన్నవజ్రముల చేసరులు ధరించి
యావేళఁ బంచమహాయజ్ఞములను
గావించి పతి యున్నగతి విలోకించి
సింగంపు మొగముల చేరుల్లె నొప్పు
బంగారు కంబాల బవిరి కన్పట్టు
చారువిశాలభోజనశాల ప్రోల
సారసలోచనల్ జతఁ గూర్చినట్టి
ధవళశంఖంబులు తాళముల్ ప్రోయఁ
బువ్వుఁబోఁడు లటు బోనపుటికలఁ దెచ్చి
సరిగబంగరు తెర చాటుగ నిల్ప

మఱియొకకొందఱు మానినీమణుల
ధరణీశ్వరునకుఁ గుందనఁపుఁ బీఠమునఁ
బరపుగాఁ బురతకాల్పుఅపు ఘటించి
ఫలకముల్ రత్నకంబళముల్ తివాసు
లలఁతి చక్కళ్ళముల నందంద నిల్పి
మగఱాల నిగరాల మలచిన పనుల
జిగిఁదేఱు బంగారు సింగపుఁగోళ్ల
నారూఢమై మించు నడ్డిగమీఁదఁ
బేరోదనపు బొడ్డు పెద్దపళ్లెంబు
పదిలంబుగా నుంచి భాసురకనక
కదళీదళము లిరుగడల నమర్చి
బటువులు చౌకముల్ పట్టెలు గాఁగ
ఘటియించి నట్టి బంగరు గిన్నె లునిచి
యోరలఁ గీర మయూర దుత్తూర
కోరకముఖములఁ గ్రొంబైఁడి గిండ్లఁ
గలువ పాదిరి తావి గమగమ వలచు
చలువనీ రటునుంచి చాలుగా నించి
యంచమోముల మించు హరివాణములును
గంచముల్ పళ్లెముల్ గంగాళములును
గదళీదళమ్ములు కత్తెర దొప్ప
లుదిరిగిన్నెలు కోర లుచితం బెఱింగి
రెండుబంతులును వేర్వేఱ నమర్చి
కొండిక పాయంపుఁ గులుకు గుబ్బెతలు
పళ్లెముంచితి మని భయభక్తులమర
నల్లనల్లన నిల్చి యపు డెచ్చరింప

వేదండ నున్న యావేదండయాన
కైదండ యొసఁగ బంగరు పీఁట డిగ్గి
పట్టభద్రుఁడు జీనిపట్టుగద్దిగను
పట్టంపుఁజెలులతో బంతిఁ గూర్చుండ
గిలుకుమట్టెలు మ్రోయఁ గీరసల్లాప
కులుకుచుఁ బచ్చడుల్ గొనివచ్చె నొకతె
జాళువాకడియముల్ సరిమ్రోయ నొకతె
శాలితండులపుఁ బ్రసాదంబుఁ దెచ్చె
ముంగాముురంబులు మొరయఁగా నొకతె
బంగారుచాయల పప్పులు తెచ్చె
తరుణి యొక్కతె సందిదండలు మ్రోయ
సరగునఁ దెచ్చెను సద్యోఘృతంబు
సరిపెణల్ తడఁబడఁ జయ్యన నొక్క
గురుకుచ శాకపుఁ గూరలు దెచ్చె
నప్పడాల్ నువుఁబొడి హావణించినట్టి
కప్పురకోడి యొక్కలతాంగి తెచ్చె
తురిమిన తెంకాయతునియలు గూర్చి
కరివేఁపపొడి చల్లి కమ్మనినేతఁ
బొంకంబుగాఁ దాల్చి పొదిగినయట్టి
కుంకుమకోడిఁ గైకొని వచ్చె నొకతె
చణకచూర్ణంబుతో సగఁబాలు గాఁగ
మినుపచూర్ణముఁ గూర్చి మేదించి మిగులఁ
గమ్మగా వండిన కస్తూరి కోడి
కొమ్మ వేఱొక్కతె కొనివచ్చె నపుడు
చవు లుట్టిపడఁ జీని చక్కెరఁ జల్లి

నవనీతఖండముల్ నవముగాఁ గూర్చి
మృదుపాకముగ నొనర్చిన పాలకోడి
యుదుటుగుబ్బల చెలి యొక్కతె తెచ్చె
లశునఖండములు పలాండుఖండములు
విశదంబుగాఁ గూర్చి వేఁపుడుం బొల్లు
కలయంగఁ జల్లిన కట్టుకోడియును
నులువకోడియుఁ దెచ్చె నొకచకోరాక్షి
మృగమదఘనసారమేళనజనిత
ఘుగఘుగవాసన భువనముల్ నిండ
నృపభోగ్యమైన పన్నీరుపాయసము
చపలాక్షి యొక్కతె సరగునఁ దెచ్చె
వెలిచెల కఱకుట్లు వెన్నచక్కెరయుఁ
జిలికించి వండిన చేఁపలయూర్పు
జాపత్రియును గురాసాని యోమంబు
వేఁపుళ్లు కొలనురి విత్తులు గూర్చి
రంజిలునట్టి బిరంజి వేఱొక్క
కంజాక్షి యప్పుడు గైకొని వచ్చె
వడియముల్ వపఁగూర్చి[1] వండినయట్టి
పొడికూరవర లోకపాలఁతుక తెచ్చె
వెలిచెల పూరేళ్ల విలసిల్లునట్టి
చలువయానం బొకసఖి తెచ్చె నపుడు
క్రొందునుకలుచేసి క్రొవ్విన వేఁట
కండనగాయ తక్రంబునఁ గడిగి
జంబీరసారసేచనముఁ గావించి
గంబూర కస్తూరి కడు కదంబించి

1. వముఁగూర్చి.

యొప్పుగా వపతోడ నొనఁగూర్చినట్టి
యప్పురసం బొకయొయ్యారి తెచ్చె
నప్పడంబులు వడియంబులు గూర్చి
కప్పురతావులు ఘుమ్మని నిగుడ
రుచుల చిక్కుడుకాయ రొయ్యలయూర్పు
కుచజితలికుచ చేకొనివచ్చె నొకతె
బిత్తరి యొక్కతె పేణీలు తెచ్చె
మత్తకాశిని యోర్తు మండెగల్ తెచ్చె
లలనామణి యొకర్తు లడ్వముల్ దెచ్చె
కలికి యొక్కతె పూర్ణకలశముల్ దెచ్చె
సకియోర్తు వెన్నక జ్జాయంబు తెచ్చె
మకరలోచనయోర్తు మణుఁగుఁబూల్ తెచ్చె
అతివ యొక్కతె తెలి యతిరసాల్ దెచ్చె
సతి యోర్తు తగుసారసత్తులు దెచ్చె
కలకంఠి యొక్కతె కఱివడల్ దెచ్చెఁ
దలిరుఁబోణి యొకర్తు దధివడల్ దెచ్చె
రమణి వేఱొకతె యామ్రమపువడల్ దెచ్చెఁ
గోమ లొక్కతె పప్పుకుడుములు దెచ్చె
తెలికుక్కరొట్టెయుఁ దెంకాయరొట్టె
చలువలు వెదచల్లు సంబారురొట్టె
తెరటు బెల్ తనిఁబాలు తెంకాయపాలు
గరగరనగు జీలకరపాయసంబు
సరగ డాల్ వైచిన చలువపాయసము
సురభిళంబై యొప్పు సొజ్జిపాయసము
కమ్మని శిఖరిణుల్ కలవంటకములు

కొమ్మలు కొండలు కొనివచ్చి రపుడు
రసములు జిలికెడు రసదాడిపండ్లు
కుసుమమాత్రమును మించు కోమలి తెచ్చె
చిలుప చిలుప తేనెఁ జిలికెడు పనస
తొల లొక్కగంధసింధురయాన తెచ్చె
తియ్యమామిడిపండ్లు తేనెలో వైచి
యొయ్యన నపు డొకయొయ్యారి తెచ్చె
రస మొలుక ద్వీపాంతరపు ద్రాక్షపండ్లు
పసమించు ఖర్జూరఫలపరంపరలు
నిగనిగల్ వెదచల్లు నేరెడుపండ్లు
పగడాల జిగిఁదేలు బలు రేఁగుపండ్లు
గేదంగి చాయల కిత్తడిపండ్లు
స్వాదుగుణంబు డించని పాలపండ్లు
కాంతులు దేలు చొక్కపు దోసపండ్లు
వింతరుచుల్ చూపు వెలఁగపండులును
బైగోవకెంపుల పకపకనవ్వు
బాగైన దాడిమపండ్ల విత్తులును
దళుకు జీని కడాని తట్టల నించి
వెలఁదులు తెచ్చిరి వేర్వేఱ నపుడు
చొక్కమౌ వెన్నరుచుల్ బిసాళింప
మిక్కిలి పసమించు మీఁగడచట్లు
సారమౌ జంబీరసారంపురుచులు
మీఱంగ లవణంబు మితముగాఁ గూర్చి
మేలైన సొంటితో మిళితమైనట్టి
యేలకిపొడి వైచి యింపు దీపింపఁ

దగు వట్టివేళ్ల చేతావులు గట్టి
మగువయొక్కతె నీరుమజ్జిగఁ దెచ్చె
పరిపరివిధముల బహుపదార్థములు
తెలివ లిత్తెఱఁగునఁ దెచ్చి వడ్డింప
నారామభద్రున కర్పణచేసి
యారాజముఖులతో నపు డారగించి
శీతాంశువదనలు చేగిండ్లు వంప
శీతలోదకమునఁ జేతులు వార్చి
యవనీశుఁ డపుడు శుద్ధాచమనంబు
సవరించి తులసిభక్షణ మొనరించి
యాలోన శతపదన్యాసంబు చేసి
బాలరామాయణపఠనం బొనర్చి
జాళువా బంగారు సరిగల పనుల
మేలైన గద్దిగమీఁదఁ గూర్చుండ
పడఁతులు కపురంపు బాగా లొసంగ
విడెముసేయుచు నున్న వేళను జేరి
ముత్తెలయారతుల్ ముదితలు జాల
బత్తితో నెత్తి రాపట్టభద్రునకు
నీరీతిఁ గొలువుండి యింతుల నెల్ల
వారివా రిండ్లకు వరుసతోఁ బనిచి
జారుగు పీఁటలు జలసూత్రములును
సారకాసారముల్ చాల నొప్పారు
నారామసీమ లొయ్యనఁ జేరవచ్చి
యారాజకందర్పుఁ డందంబు మీఱఁ
దుంటవిల్ కడ వైచి దురుసైనయట్టి

యుంటవిల్లు వహించెనో మరుం డనఁగ
నుడిగంపు నెచ్చెలు లుంట లందీయ
కడనున్న లక్ష్యముల్ గదియ నేయుచును
విరులజొంపములచే వేడ్క పుట్టించు
సురపొన్ననీడలు చూచి సొక్కుచును
తిన్నని వలితాల తిన్నెల మించు
పొన్నగున్నలనీడ పొగడుచుఁ జేరి
చందన కాంచన సహకారములును
మందార జంబీర మాతులుంగములు
పారిజాత పలాశ పారిభద్రములు
నారంగ పూగ పున్నాగ నాగములు
మొదలైన తరువుల మురువుఁ గన్గొనుచుఁ
బొదరిండ్ల భృంగముల్ పొదలఁజూచుచును
చిలుకలు కోయిలల్ చెలరేఁగి పల్కఁ
గొలఁకుల జక్కవల్ కూడి క్రీడింప
శారికాదంపతుల్ జతఁగూడి పల్కఁ
గోరి మయూరికల్ కొలువులు చూప
మలయానిలము శైత్యమాంద్యసౌరభ్య
కలితమై యందందఁ గడు మీటారింపఁ
గనుఁగొంచు నప్పు డాకాంతారమునను
జనరంజనంబైన సంపంగినీడ
నావింటి కొప్పున హస్తంబుఁ జేర్చి
పూవింటిరాయల పొలుపు[న నున్న*]
నిది వేళ యని చాల నిచ్చలో నుబ్బి
సుదతి పంచినయట్టి శుకరాజ మప్పుడు

మనుజభాషణముల మమతఁ జూపుచును
జనపాలు హస్తాంబుజంబుపై వ్రాలి
కల్యాణగుణశీల కరుణాలవాల
కల్యాణ మగు నీకు కామినీమదన
నీమోహనాకృతి నీవిలాసంబు
భూమిరాజులయందుఁ బొడఁగాన నెందుఁ
బ్రభుశిఖామణి యనఁ బ్రస్తుతికెక్కి
యభినవాంగజుఁడవై యవతరించితివి
నినుఁ గనుంగొనునట్టి నెలఁత కెందైన
మనసు కరఁగకున్నె మదనావతార
అని పల్కు రాచిల్క నందంద దువ్వి
జనపతి పలికెను జాతుర్య మెసఁగ
నెవ్వరు పోషింతు రెచ్చట నుందు
వివ్వనంబునకు రా నేమి కారణము
రాచిల్క నవసుధారసధార లొల్క
మాచెవులకు నీదు మాట లింపయ్యె
నీవు వచ్చిన కార్య మెఱిఁగింపు నీకుఁ
గావలసిన కోర్కి కావింతు ననిన
రాజకీరము పల్కె రాజదేవేంద్ర
రాజకంఠీరవ రాజాధిరాజ
రాజన్యమూర్ధన్య రాజదేవేంద్ర
అమ్మఘువంతుని యాచార్యుఁడైన
మిమ్ము మాటలచేత మెప్పింపఁగలఁడె
అంతటివాడు మీ రవకాశ మిచ్చి
వింతగా నాపల్కు వినఁగోరు టెల్ల

బళి బళి నేఁడు నా భాగ్యంబు కాదె
తెలిపెద వినవయ్య ధీరవిచార
నేను వచ్చిన కార్య మెఱిఁగింపు మనుచు
నానతిచ్చితివి కార్యంబు ఫలించెఁ
బాడి తప్పని పట్టభద్రుండ వందు
రాడి తప్పని రాజ వందురు నిన్ను
గాన నే వచ్చిన కార్యభారంబుఁ
బూని తెల్పెద విను భువనైకవీర
ప్రజ లెల్లఁ గొల్వఁగా రాజమార్గమున
గజరాజుపై నెక్కి గరిమతో మీరు
నెరరాజసంబున నేఁడు విచ్చేయ
సరిలేని మణిసౌధజాలమార్గమున
మక్కువ మిమ్ముఁ జూచి మాచిత్రరేఖ
మిక్కిలి సొక్కి యా మీనాంకుఁ డేఁచ
శృంగారవనిఁ జేరి శృంగారవతులు
సంగతిగాఁ జేయు చలువలవలనఁ
గంతుసంతాపంబు కడతేఱకున్నఁ
గాంతను జూచిన కనికరంబునను
జిన్ననాఁ డాదిగాఁ జెలిమితో నన్ను
మన్నించి పెంచిన మన్నన నెంచి
కన్నెరో యేటికిఁ గందెద వన్న
నన్ను వీక్షించి యా నారీలలామ
సమ్మదంబున మీరు స్వారి వచ్చుటయు
మిమ్ముఁ గన్గొని తాను మేల్పడుటయును
ఆదిగాఁ గల కార్య మంతయుఁ దెల్పి

యేది దిక్కని మఱి యెంతయుఁ గుంది
యందని ప్రాణిపం డాశించియున్న
నందంబుకాదె నే నతనిఁ గోరుటలు
కోరిన నేమాయెఁ గువలయపతులఁ
గోరి తెమ్మనునట్టి కొమ్మలు లేరె
కూరిమి మీఱఁగాఁ గోరిన పతిని
నేరుపుతోఁ దెమ్ము నెచ్చెలు ల్లేరె
యక్కటా నామోహ మాఱడివెట్టి
యెక్కడి వల పిది యెక్కడి తలఁపు
అక్కరో చాలించు మని రింతె కాని
మక్కువఁ జెలులు నా మదనవేదనలు
తెలిసి నావిభుఁ దోడితెచ్చెద మనుచు
బలి బలీ యొకమాట పలుకలేరైరి
అని వారి దూఱి హంసాళిఁ గోకిలల
ననుపంగలేక నన్ననుపుచో మీకు
మాటి మాటికిఁ దన మనవు లన్నియును
బోఁటి తెల్పుమటంచు బోధించి పంచె
మిమ్ము సారెకుఁ జూచు మీరూపరేఖ
నెమ్మదిలోపల నెలకొనఁ జేసి
సమ్మదంబున నున్న సమయంబుఁ జూచి
కమ్మగేదఁగినేజఁ గైకొని మరుఁడు
చేకొద్ది ననుఁ గుమ్మి చీకాకుచేసె
నో కృపానిధి యింక నోర్వలే నని యె
కనకాంగి రూపరేఖావిలాసములు
వనజాసనునికైన వర్ణింపఁదరమె

మరుని పట్టపుదంతి మరువంపుబంతి
తరుణుల మేల్బంతి తగు నీకె యింతి
ఆకన్ను లాచన్ను లావిలాసంబు
లాకుల్కు లాపల్కు లామిటారంబు
లానగ వాబిగు వారువారంబు
లానీటు లాపాట లావికాసంబు
లాచంద మాయంద మాయొయారంబు
ఆచెల్వ మేచెల్వ లందును లేదు
ధరణీశ యాయింతి దక్కిన నీకు
మఱి వేఱె తక్కిన మాట లిం కేల
రాజశేఖర మిమ్ము రసదృష్టిఁ జూచు
రాజబింబాస్యపై రతిరాజు కినియఁ
జేపట్టక పరాకు చేసితి రేనిఁ
గోపింపవలవ దా కొదవ యెవ్వరిది
అని పల్కు పల్కుల కప్పుడు మెచ్చి
మనుజాధినాథుఁ డామత్తకీరంబు
మీచెలి మామీఁద మేల్పడె ననుచు
నాచిత్తజుఁడు చాల నల్గినాఁ డనుచు
నమ్మిన కొమ్మపై ననవింటివాఁడు
దొమ్మిసేయ నుపేక్షతో నుంట మీకుఁ
దగవు కా దనుచు వార్తాచమత్కృతిని
మొగమొగంబున మమ్ము మోదనాడితివి
ఇక్షుశరాసనుఁ డేఁచ మీ చెలిని
రక్షించుటే మాకు రాజధర్మంబు
అన్నిటఁ జక్కనిదఁట యటుమీఁద

మన్నన గలదంట మామీఁదఁ జాల
నటుమీఁద ద్విజరాజవగు నీవె వచ్చి
ఘటియింతువఁట యెట్లు కాదనవచ్చు
అని తన విన్నపం బంగీకరింప
మనుజాధిపతిఁ జూచి మఱి చిల్క పలికె

భూపాలచంద్ర యద్భుత మిది కాదె
నేపాళ పాండ్య తుండీరాది రాజ
కన్యకామణులను గరుణాకటాక్ష
విన్యాసమున నైన వీక్షింపనట్టి
దక్షిణరాయమూర్ధన్యుఁడ వౌక్క

పక్షిమాటలు విని పక్షీకరించి
మారుని కేళిని మాచిత్రరేఖ
నీరేయిఁ జేపట్టి యేలెద ననుచు
నానతిచ్చితివన్న నన్నలినాక్షి
యేనోము నోచెనో యెంత పుణ్యంబొ

మత్తేభగామిని మనవి నేఁ దెల్పఁ
జిత్తగించి పరాకు సేయరా దికను
అచ్యుతరఘునాథ యతిమోహనాంగ
విచ్చేయవలయు మావెలఁది యింటికిని
అని పల్కఁగా విని యా చిల్కఁ జూచి

జనపతి చంద్రికాసమయంబునందు
నెలఁతయింటికి మేము నేఁడె విచ్చేసి

యెలమి నంగజరాజ్య మేలింతు మనుచుఁ
దెలుపుమా నేఁడు మీతెఱవతో ననుచుఁ
బలికినఁ జిల్క యోపార్థివచంద్ర

సమయంబుఁ జూచి మీ సముఖంబుఁ జేరి
విమలాంగి మనవి నే విన్నవించుటకు
దేవరవారు నేఁ దెలిపిన మనవి
గావింతునని యనుగ్రహము సేయుటకు
ముదలగా రాజన్యమూర్ధన్య నేఁడు

ముదితకుఁ బాలింపు ముద్దుటుంగరము
నా విని యారఘునాథభూపాలుఁ
డావేలియుంగర మటు దయసేసి
యిదె వత్తునని తెల్పు మింతితో నీవు
ముదమునఁ బోయిరా ముద్దురాచిల్క

అని పంపఁగాఁ జిల్క యాయుంగరంబుఁ
దన చంచుపుటమునఁ దగిలించి మిగుల
గతివైఖరుల మించ గగనమార్గమున
నతివేగమున వచ్చి నవసరంబునను
భూపాలుపాలికిం బోయిన చిల్క

యీపొద్దు రాదాయె నేమొకో యనుచు
నందందఁ జింతించి యంతరంగమునఁ
గుందుచుఁ దనరాకఁ గోరుచునున్న
యాకొమ్మచేవ్రాలి యాయుంగరంబుఁ
గోకొమ్మటంచుఁ గ్రక్కునఁ జేతి కిచ్చి

చెలికిఁ దాఁ బోయి వచ్చిన విధం బెల్లఁ
దెలిపిన హర్షించి దీవెన లిచ్చి
యన్నరనాథుని యంగుళీయకముఁ
గన్నులకల్కి తాఁ గన్నుల నొత్తి
గుబ్బలపైఁ జేర్చి కొప్పుపైఁ జేర్చి

యుబ్బి యానందాబ్ధి నోలలాడుచును
జిగిమించు ముద్దురాచిల్కను జూచి
పొగడుచుఁ బల్కె నాపూర్ణేందువదన
నాకోర్కు లీడేర్చి నాప్రాణవిభునిఁ
జేకూర్చి నన్ను రక్షించితి వీవు

సకుల నెందఱినైన సంతరించితిని
పిక మరాళ మయూర భృంగసంతతులఁ
బోషించితిని నేఁడు పూవింటివాఁడు
ద్వేషింప నొకరైన దిక్కైరె నాకు
నిను సంతరించుట నేఁడు ఫలించె

మనసు రంజిల్లె నాముస్నేహంపీరు
సమయంబుఁ గనుఁగొని చనవునఁ జేరి
మమతతో వేఁడు నా మనవులు తెలిపి
మానవాధిపుఁడు నా మందిరంబునకుఁ
దానె వచ్చుటకు నెంతయు నొడంబఱిచి

నామీఁద దండెత్తి నడచినయట్టి
కాముని పాళెంబుఁ గడకుఁ దీయించి

ముద్రగా విభుచేతి ముద్రికం దెచ్చి
భద్రంబుగా నాకుఁ బాలించి తిపుడు
నీవు చేసినమేలు నెమ్మదిలోన

నేవేళఁ దలఁతుగా కేనేల మఱతు
నని పల్కి రాచిల్క నపు డాదరించి
కనకపాత్రంబునఁ గండ చక్కెరయు
మేలైన పండ్లు పాల్ మీఁగడ పెట్టి
లాలించి తనయొద్ది లలనలఁ జూచి

పాటలాధరలార పడకిల్లు చాల
నీటు మీఱంగ మీ నేర్పెల్ల మెఱసి
శృంగారరచనలు సేయఁబొం డనుచు
నంగనామణి వారి ననిచె నంతటను
గొందఱు నెచ్చెలుల్ కోమలి కపుడు

చందన కుంకుమ సంకుమదముల
నలుగుఁ బెట్టి చిరత్న నవరత్నరుచిర
కలధౌత ఘటముల గమగమ వలచు
గొజ్జఁగి నీటిచే గురుకుచ కపుడు
మజ్జనం బొనరించి మణుఁగుల చేత

మలయజగంధికి మై తడి యొత్తి
వలిప చెంగావి పావడఁ గట్ట నిచ్చి
బంగారు సరిగంచు పయ్యెద మించ
శృంగారముగఁ జల్వచీరఁ గట్టించి
ఘనసార కాశ్మీర గంధసారములు

మనసారఁగాఁ గూర్చి మైనిండ నలఁది
పద్మిని కప్పుడు బంగారు సరిగ
పద్మరేఖల కుట్టుపని గనుపట్టు
కీలురత్నపుగుండ్ల కెంబట్టుఱవిక
లీలగాఁ దొడిగించి లేమలు ప్రేమఁ

గురులు దువ్వి మిటారికొ ప్పమరించి
పరువంపు విరిసరుల్ బటువుగాఁ జుట్టి
ముంగామురారియు ముత్యాలకంటె
రంగుమీఱిన పెంచు రతనాల కుచ్చు
మెచ్చుగఁ గులికెడు మేటికిరీటి

పచ్చఱాపలకల పాదపల్లవము
ముంగర ముత్యాల మురువుల బవిర
లుంగరంబులు మించు నొడ్డాణములును
గంటసరంబులుఁ గంఠమాలికలు
గంటల మొలనూలు కంకణంబులును

పుంజాల దండలు బుగడలుఁ గమ్మ
పంజుల పదకముల్ బన్నసరములు
సందిలి[1] దండలు జాళువా గొలుసు
లందియల్ మట్టియ లాదిగాఁ గల్గు
నవరత్నమణిభూషణంబు లందీయ

వివిధాంగశృంగారవిధు లాచరించి
చికిలి చేసినయట్టి చెఱకువిల్కాని

1. సందుల

యకలంకసమ్మోహనాస్త్రమో యనఁగ
రతి విలాసమునభారతి వికాసమున
నతిశయించిన మనోహరలీలతోడఁ

బ్రకటానురాగియై ప్రాణేశ్వరునకు
శుకవాణి యెదురు చూచుచునుండె నంతఁ
బద్మినీముఖపద్మబాంధవం డెంచి
పద్మలోచన తనపతిఁ గూడువేళ
తా నుండరాదని తగ వెంచినట్లు

భానుండు చనియెను బశ్చిమాంబుధికి
నాగంధగజయాన కధిపతిమీఁది
రాగంబుగతి సాంధ్యరాగంబు పర్వె
నాయకుం డచటికి నడతెంచుకొఱకు
నాయిందువదన కట్టాణిముత్తెముల

గమకమౌ చందువా కట్టించె ననఁగ
నమరపథంబున నమరెఁ దారకలు
వల్లభుం డింటికి వచ్చువేళకును
బల్లవాధర కడు భక్తిమీఱంగ
నపరంజి పళ్లెంబునందు నందముగఁ

గపురంపుటారతి కై సేసె ననఁగ
నుదయరక్తిమఁ జాల నొఱపుమీఱంగ
నుదయాద్రిపైఁ జంద్రుఁ డుదయించె నంత
నీలాగుఁ గై సేసి యిందీవరాక్షి
తాళరాని విరాళిఁ దాలిమిఁ దూలి

కాంతుండు రాఁడాయెఁ గడుఁ బ్రొద్దు పోయెఁ
గంతునిమాయ వెగ్గలమాయె నకట
చిలుకపలుకులను జిత్తంబులోన
నిలుపునో నిలపఁడో నెనరువాటించి
సముఖంబు సేయని సతుల వంచించి

రమణుఁడు వచ్చునో రాఁడొకో యనుచుఁ
బలుమరు చింతించి పండు వెన్నెలల
చలువలు వెదచల్లు జాబిల్లిఁ జూచి
బడబాగ్ని లోఁగొన్న పాలమున్నీరు
కడుపులో నిల్పక కడవైచె నిన్నుఁ

గాలకూటముఁ దిన్నఘనుఁడు నీకాఁకఁ
దాళక పదమునఁ దాటించె నిన్ను
నర్కమండలదర్శనాభ్యాసియైన
కర్కశుం డత్రి నీ కాఁకకుఁ గాక
నిజదృష్టిపథమున నిల్పక నిన్ను

ద్విజరాజ గగనవీథికిఁ జిమ్మె ననిన
నింతులు నీకాఁక కెట్లు సైరింతు
రింతైన దయఁజూడ వేమందు నిన్ను
అని చందురుని దూఱి యధిపతిరాక
తన మనంబునఁ గోరి తమిమీఁద యుండె

నావేళ నరనాథుఁ డారామసీమఁ
దావులు గుల్కు నిద్దపు వట్టివేళ్ల

చలువ చప్పరములో జవ్వనుల్ గొలువఁ
గొలువున్నచో శ్రుతుల్ ఘుమ్మని మ్రోయ
సంగీతమేళంబు జతగూడి నడవ

బంగారు దివ్వటిబారుతో వచ్చి
చెంతఁ జేరి సలాము చేసి చేఁజూప
నింతులు చాలుగా నెనసి కొల్వంగ
శృంగారనాయకశేఖరుం డగుచుఁ
జెంగట నొక్కరాజీవలోచనకు

విడె మిచ్చి పుక్కిటి విడెముఁ గైకొనును
జడఁబట్టి యొకతెను సారెకుఁ జెనకు
బొటవ్రేలఁ గొని నీవిఁ బోమీటి యొకతె
బటువుగుబ్బలుఁ జీటి పలుమఱు నవ్వ
మోవి యి మ్మనుచును మొక్కు నొక్కతెకుఁ

దావికుంకుమఁ బూయుఁ దరుణి కొక్కతెకు
బిగువుఁ గౌఁగిట నుంచు బ్రేమ నొక్కతెను
జిగిమించు తొడలపైఁ జేర్చు నొక్కతెను
ఒకతెపాటకు మెచ్చు నుత్సాహ మొదవ
నొకతెయాటకు సొక్కు నుల్లంబులోనఁ

గంతుఁ డీరాజశేఖరుఁడని యెంచుఁ
గొంత ప్రొద్దీలాగు కొలువున నుండి
యంతఃపురంబున కతివలఁ బనిచి
యంతట చిత్రరేఖాభిలాషంబు
పూరింపఁగోరి సంపూర్ణశృంగార

సారంబు పొంగార జవ్వాదితావి
నెరయ గుబాళించు నెఱికురుల్ దువ్వి
మురువుగా సిగవైచి ముడుపులు చుట్టి
చిగురుచందురకావి జిలుగుదుమాల
సిగచెంపకడ జాఱఁ జెలువుగాఁ గట్టి

కుఱుచ గేదంగి రేకుల రేక లమర
చెఱఁగులు ముందఱఁ జేర్చి యమర్చి
నెలవంక పొంకంబు నీటు పాటింపఁ
దెలిసోగ చికిలిముత్తెపు తురాఁ జెక్కి
మురువులు కట్టాణిముత్యాల కంట

సరుల వజ్రంపుఁ జేసరుల హారములు
చొక్కపు వెలహెచ్చు సోగముత్తెముల
నొక్కజోడై మించు నొంట్లు ధరించి
యారజంబుగ లలాటాభ్యంతరమునఁ
దీరుగా మృగనాభితిలకంబు దిద్ది

గోవజవ్వాది కుంకుమ కపురంపుఁ
దావిపన్నీట మర్దనముఁ గావించి
కలయఁగఁ గూర్చి బంగరు గిన్నె నుంచి
కలకంఠి తెచ్చిన కలప మలంది
మొలకకెంపులపిడి మొలవంకఁ జెక్కి

పలకవజ్రపుఁబని పరుఁజుచాయలను
గళలు దేఱెడు నడ్డకత్తి ధరించి

వలపుఁగ్రొవ్విరిబంతి వలకేలఁ బూని
పురతకాల్ పట్టు పాపోసులు తెచ్చి
మురువుగా నొకయింతి మునివేళ్లఁ జేర్పఁ

గడుసొంపుమీఱు శృంగారవనంబు
వెడలి యా పున్నమ వెన్నెలబైట
వచ్చుచో నడపంపు వాల్గంటి చేరి
పచ్చకప్రపుఁ బల్కుబాగా లొసంగి
జిగిమించు పచ్చఱాచిలుకల పనులఁ

దగు నాగవల్లికాదళసంపుటమున
నలమిన తెలనాకు లాకాకు దిగిచి
వలిపపైఠాణి పావడఁ దడి యొత్తి
గోరను కుఱుచ రేకులు గాఁగఁ జీల్చి
నారయఁ బైపార నడిమీనె దిగిచి

తెలినిగ్గు క్రొత్తముత్తియపు సున్నంబు
కొలఁదిగాఁ జమిధి రేకులు విదళించి
మడఁచిన మడుపులు మాటి కందీయ
విడెముసేయుచు రాజవీథిలో వెడల
నుప్పరం బందిన యుప్పరిగలును

జప్పరంబులఁ జంద్రశాలాంతరములఁ
దిన్నని నెలఱాల తిన్నెలయందు
వెన్నెలబైటను వివిధలీలలను

సలలిత కందర్ప........హాస్య[1]
...నుద్ధరించు దంపతులఁ గన్గొనుచు
సంకేతనిలయంబు సరసకుఁ జేరి
యింక నా నాయకుం డిందు రాఁ డాయె
నని తమ రమణుల నందంద వెదకు
వనజలోచనలున్న వగలు చూచుచును
గాంత లల్గినచోటఁ గాళ్లకు మ్రొక్కి
యింతులఁ బ్రార్థించు టెల్లఁ జూచుచును
విరుల పానుపుమీఁద వెన్నెలబైట
నొరపుగాఁ బవళించియున్న మిటారి
సరసకుఁ జేరి తా సంజప్రొద్దునను
గుఱుతుగా నలఁదిన కుంకుమరసము
హరిచందనాలేపమై[2] తోఁప విటుఁడు
పరకాంతయని చలింపఁగఁ జూచి నగుచుఁ
బొలయల్కతో నున్న పొలఁతి యటంచుఁ
గలధౌతపాంచాలికను వేడఁ దాని
చాటునఁ దన చెలి జడకొద్దిఁ గొట్టె
వేటున కులికెడు విభుఁ జూచి నగుచుఁ
బచ్చలు చెక్కిన పదకంబులోన
నిచ్చలంబుగఁ దన నీడ తోఁచినను

1. సలిలంబు కందర్ప......హాస్య
2. హరిచందనాటోపమై.

జెలఁగి చిక్కితి వంచుఁ జెనకఁదలంచు
కలికిగోలతనంబుఁ గనుఁగొని నగుచు

సయ్యాటమునఁ దమ సతులను విరుల
శయ్యలపైఁ జేర్చు జాణలఁ గనుచు
నగరుశోధనకు భూనాథుఁ డీ రేయి
నగరు వెల్వడి వచ్చినాఁ డని యెంచి
కొలువు కెప్పుడు వచ్చు గుఱిదొర లెల్లఁ

దొలఁగి యుండంద సందులు దూరి చనఁగఁ
జనవరు లగు దొరల్ సరస నింతంతఁ
గని పెట్టుకొని తన్నుఁ గాచి కొల్వంగ
జనపాలుఁ డాపౌరజనవిలాసములు
గనుఁగొంచు నూతనకందర్పుఁ డనఁగ

సూనాస్త్రశాస్త్రముల్ శుకములచేత
సానికూఁతులు నేర్చు సౌధవీథులను
జిత్రంబుగా మున్ను చిలుకచే విన్న
చిత్రరేఖగృహంబుచెంగటఁ జేరి
తన రాక రాకాసుధాకరముఖికి

ననురాగమునఁ దెల్పుమని పీడుకొల్ప
నడపంబుజవ్వాని యాచిత్రరేఖ
కడఁ జేరఁ దను జూచి గ్రక్కున లేచి
కడలేని కూర్మితోఁ గాఁగిటఁ జేర్చి
పడఁతిని జూచి యోభామాలలామ

పాండిత్యవతులైన పాండ్య తుండీర
మండలాధీశకుమారికామణులఁ
గడకంటఁ జూడని కాంతుఁడే నీదు
పడకింటికిని రేయిఁ బాదచారమునఁ
దాన వచ్చెనటన్నఁ దరుణులలోన

నీనోముఫలము వర్ణింపఁ దరంబె
విమలాంగి నమ్ము భూవిభుఁడు నీసొమ్ము
రమణుని కెదురుగా రమ్ము లె మ్మనిన
గొబ్బున నాగబ్బిగుబ్బెత యప్పు
డుబ్బు నబ్బురమును నుత్సాహ మొదవ

మధురవాక్యముల నమ్మానినీమణికి
నధికోపచారమ్ము లాచరింపుచును
ఆరతుల్ వివిధచిత్రాన్నకుంభములు
కూరిమి నెచ్చెలుల్ కొందఱు దాల్పఁ
బన్నీటి గిండియుఁ బావడఁ బూని

కన్నియ యొకతె చెంగటఁ జేరి నడవ
రమణీయమణిసౌధరాజంబు డిగ్గి
తమకంబు కోరిక దయ చిఱునవ్వు
గమకంబు సిగ్గు నగ్గలికయు మించ
రమణుని కెదు రేగు రతిదేవిఠీవిఁ

బతి నెదుర్కొని సమీపంబున నిలిచె
నతని జగన్మోహనాకార రేఖ

నించుకించుక దల యెత్తి చూచుచును
వంచిన మోముతో వాల్గంటి సేయు
సన్న లెఱింగి యాసన్నులై యున్న
కన్నియ లా రాజకంఠీరవునకు
నరుణాంబరములు చిత్రాన్నకుంభములు
వరుసగాఁ దెచ్చి నివాళించి వైవఁ
గన్నియ యొకతె బంగరుగిండి వంపఁ
బన్నీటిచేఁ బతి పాదముల్ గడిగి
కులుకుగుబ్బలమీఁది కుంకుమతావి
జిలుకు పయ్యెదకొంగుచేఁ దడి యొత్తి
యారాజచంద్రున కత్యాదరమున
నీరాజనం బిచ్చె నీరజనయన
యివ్విధంబునఁ దన హృదయం బెఱింగి
జవ్వని రాజోపచారముల్ సేయ
నేకాంతలకునైన నేకాంత మీని
భూకాంతుఁ డాకాంత పొంకంబుఁ జూచి
యీనగ వీబిగు వీరూపరేఖ
లీనీటు లీతేట లీవిలాసంబు
ఈ పొంక మీబింక మీయందచంద
మేపంకజాక్షులం దెందును లేదు
నాయంతవానికి ననువు కల్పించె
నీ యింతి యింతుల కెల్ల మేల్బంతి
శుకవచనంబు లీ శుకవాణిపట్ల

శుకవచనంబుల నూటి బాటించె
నని కొనియాడుచు నంతరంగంబు
ఘనరాగరసతరంగమునఁ గరంగ
అచ్చుతేంద్రునిపట్టి యతివఁ జేపట్టి
మచ్చికతోడ నమ్మణిసౌధమునకు

వనితను దోకొనివచ్చి యిద్దరును
బెను తురంగి పరంగి పీఁటలమీఁద
సమముగాఁ గూర్చున్న సమయంబునందుఁ
గమలవిలోచన కనుసన్న నొక్క
చిపురాకుఁబోణి దేశీయరాగముల

నవనవంబుగను వర్ణములు కల్పించి
యతనురసాలసయై[1] చిత్రరేఖ
పతిమీఁదఁ జెప్పిన పదములు గొన్ని
తాన మానముల సుధారసం బొలుక
వీనులవిందుగా వినుపించె నొకతె

చెలువుగాఁ దంబుర చేఁబూని యొక్క
కలకంఠి వినుపించెఁ గట్టివాద్యంబు
పెక్కురీతులఁ దాళభేదముల్ మెఱయ
డక్కివాయించె మిటారి యొకర్తు
కొనగోరఁ దంత్రులు ఘుమ్మని మీటి

ననఁబోఁడి యొకతె కిన్నరఁ బలికించెఁ
బంతువిధంబునఁ బదజాతి యమర

1. యతనురసాలసయై.

వింతగా నొకచెలి వీణె వాయించె
మురళి చెంగు రబాబు ముఖవీణె దండె
విరిబోండ్లు కొందఱు వినుపించి రపుడు

తాము నేర్చిన వినోదపువిద్య లిట్లు
వేమఱు భామలు వినుపింప వినుచు
మగఱాల నిగరాల మలచిన కోళ్ల
పగడాల గొప్ప చప్పరపు మంచంబు
కుదినిపట్టున మించు కుంకుమ పఱుపు

మృదుహంసతూలికామిళితంబులైన
పురతకాల్ తలగడల్ పుంబొత్తునేతఁ (?)
బరగు సూరెపటంపుఁ బటువు బిల్లలును[1]
తావి చెంగలువలు తమ్మిక్రొవ్విరులు
చేవంతిసరులు నించిన చందువాలు

నీలైన నిద్దంపు నిలువుటద్దంబు
గాటంపుఁజలువ మక్కాగిండ్లచాలు
గోవజవ్వాది కుంకుమ మృగనాభి
తావి గంధముల కుందనపుగిన్నియలు
తఱచుగా బంగారు తట్టల నమరు

పఱువంపు విరిసరుల్ బంతులచెండ్లు
చొక్కపుఁ దెలనాకుజోకల మించు
చక్కని జాళువాజాలవల్లికలు

---

1. బల్లలును.

కపురంపు బాగాల కడవన్నె బరణు
లపరంజి కాళంజి యరవిరి సురఁటి

దీపించు ఘనసారదీపపాత్రికలఁ
గైపుగాఁ దాల్చిన కనకపుత్రికలు
చక్కెర గసగసాల్ చారపప్పులును
చొక్కమౌ గొబ్బెర[1] ఖర్జూరంబు ద్రాక్ష
పూరించిన సువర్ణపూర్ణపాత్రములు

తోరంపు సాంబ్రాణి ధూపవాసనలు
చిత్తజు వైఖరుల్ శేఖరింపంగఁ
జిత్తరుబనులు వ్రాసిన ప్రదేశములు
శుకములు కోకిలల్ సురటీల జోళ్లు
బకదార్లు గల రత్నపంజరంబులును

గలిగి కాముని సాముగరిడిచందమున
విలసిల్లు పడకిల్లు విభుఁడు గన్గొనుచు
నింతిని మరురాజ్య మేలింపఁగోరి
కాంతాశిరోమణి కైదండఁ బూని
సౌరరాజసంబున నెలఁతయుఁ దాను

విరులపానుపుఁ జేరి వేడ్కఁ గూర్చుండి
సరసవిలాసప్రసంగసంగతుల
గురుకుచ నెఱికురుల్ కొనఁగోర దువ్వి
మగువ తీర్చిన మృగీమదతిలకంబు
జిగిమించు కొనగోర చిట్లించి నుదుటఁ

---

1. గొబ్బెర.

దీరుగా ఘనసారతిలకంబుఁ దీర్చి
సారెకుఁ గలపంబుఁ జన్నుల నలఁది
చెక్కుల మకరికల్ చెలువుగా వ్రాసి
యక్కునఁ జేర్చుచు నాదరింపుచును
విడె మిచ్చి పుక్కిటి విడెముఁ గైకొనుచుఁ

దడఁబడఁ బెనఁగొన్న తారహారముల
చిక్కుఁ దీర్చునెపంబుచేఁ గొనగోర
జక్కవగుబ్బలు సారె జీఱుచును
వయసు జాతియును భావంబునుం దెలిసి
దయమీఱఁగాఁ గళాస్థానంబు లంటి

కమలదళాక్షిని గరఁగించి కరఁగి
సుమసాయకుని కేళి సొక్కించి సొక్కి
లాలించి తేలించి లలనమే లెంచి
యేలించె రతిరాజ్య మింపు సొంపార
సారెకు రఘునాథచంద్రుఁ డీరీతి

గారవింపుచుఁ గల్వకంటినిం జూచి
వచనవైఖరుల నోవాల్గంటి నీదు
కచభార మంజనాకారంబుఁ దాల్చెఁ
బూర్ణేందువదన నీ ఫాంకమౌ నుదురు
వర్ణింప శశిరేఖవైఖరిఁ జూపెఁ

దరుణీలలామ నీ తళుకు వాల్జూపు
హరిణీవిలాసంబు లంగీకరించెఁ

గంజదళాక్షి నీ కంబుకంఠంబు
మంజుఘోషవిశేషమహిమ వహించెఁ
బంచాస్యమధ్య నీ బాహువల్లికలు
కాంచనమాలిక గరిమఁ బాటించెఁ
కోమలి ! నీదైన కోమలాంగంబు
హేమవర్ణంబుచే నెన్నికఁ గాంచెఁ
గుంభికుంభస్తనకుంభ ! నీతొడలు
రంభావిలాస సంరంభంబుఁ దాల్చె
నీరజలోచన ! నీనఖరేఖ
తారావికాసంబుఁ దక్కఁ బెనంగెఁ
గావున మోహనాకారసంపదల
నీవె రూపవతివి నిశ్చయం బిదియె
అని పల్కుపల్కుల కలినీలవేణి
మనమునఁ దన నేర్పు మాటలచేత
నాయవయవవర్ణనము సేయురీతి
నాయకుం డన్యకాంతల పేరుఁ దలఁచె
నని యెంచి మించిన యల్క వాటించి
వనజాక్షి శయ్యా నావలి మొగంబయ్యె
నది చూచి భూపాలుఁ డాకస్మికముగ
నిది యేమి కారణం బింతి యల్గుటకు
హృదయంబుఁ దెలియక హృదయం బొసంగి
మదిరాక్షితో నేను మాటాడరాదు
అనుచు నావలి మొగంబై కొంత తడవు

మనుజాధినాథుండు మఱి యూరకుండె
నేకశయ్యనె యుండి యిరువురు నిట్లు
జోకఁ గూడకయున్నచోఁ జిత్రరేఖ
యాచిత్తజుని కాఁక నలమటఁ జెంది
రాచిల్కచేత నీరఘునాథవిభుని

రయమున నింటికి రప్పించుకొంటెఁ
బ్రియమునఁ గౌఁగిటఁ బెనఁగొని యుండి
నరనాథుఁ డిప్పుడు ననుఁ గొనియాడు
టెఱుఁగ కర్థాంతరం బేను చింతించి
యక్కటా యేమిటి కలిగితి నిప్పు

డెక్కడినుండి నా కీబుద్ధి వొడమె
నేరీతిఁ బల్కెడు నీ మహామహుని
నేరీతిఁ బల్కింతు నెట్లు వేగింతు
నెవ్వరు రారాని యేకాంతవేళ
నివ్వియోగవిచార మెబ్బంగిఁ దీఱుఁ

బలికినఁ బల్కఁడో పల్కకయున్న
బళిబళీ నా మేలు[1] పలుచనౌఁగాదె
యక్కటా నావల పాఱడి యయ్యెఁ
దక్కియుండియును నీతఁడు దక్కఁడయ్యె
నిలువుటద్దములోన నీడయై నేఁడు

కలగన్నయటు లయ్యెఁ గాంతుని పొందు
ఎప్పుడు బల్కునో హృదయేశుఁ డనుచు

1. మేను.

నప్పద్మముఖి యుండె నప్పు డవ్విభుఁడు
ఈయింతి చెల్వ మే నెన్నెదు పట్ల
నేయింతిపేరు నేఁ జెప్పెడనొక్కొ

భామాశిరోమణి ప్రౌఢ కావునను
నామాట లన్యకాంతలఁ దలఁపించె
నని యెంచి నవ్వుల కలిగెఁగా కిపుడు
కనకాంగి నిక్కంబుగా నేటి కలుగు
పలుకువెంబడి నేఁడు పరకాంతఁ దలఁచి

యలుకఁ బుట్టించిన హరువున నాదు
వాచాచమత్కారవైఖరి మించ
నీ చెలిపేరు నే నెన్నితి నేని
నవ్వుల కలిగిన ననుఁ జూచి పలుకుఁ
జివ్వల కలిగినఁ జెలి యూరకుండు

నని యెంచి చిత్రపటాకార మొకటి
గనుఁగొని చిత్రరేఖావిలాసంబు
బాగాయె నని పల్క పల్కువెంబడిని
ఆగంధగజయాన యధిపతి నన్నుఁ
జేరఁ బిల్చె నటంచుఁ బ్రేమతోఁ దిరుగఁ

నారాజచంద్రుండు నభిముఖుం డయ్యె
నీరీతి వారిద్ద ఱేకీభవించి
తీరని పొలయల్క తీరినపిదప
రతియును రతిరాజు రహిఁ గూడినట్లు
జతఁగూడి పుంభావసంభావములను

మగువకు మనసిచ్చి మాటలాడుచును
మృగవిలోచనకు నమ్మిక లొసంగుచును
జెనకుచు రతులఁ జౌశీతిబంధములఁ
బెనఁకువలును దక్కఁ బెనఁగుచు నేలి
విరులపానుపు డిగ్గి వికచాబ్జవదన

కరము కరంబునఁ గట్టిగాఁ బట్టి
మేడమెట్లను డిగ్గి మేదినీవిభుఁడు
వేడుక నారాజవీథిలో వెడలి
చెక్కుటి సొంపులు చిటిలిగంధంబు
పుక్కిటి విడెము గుబులుకొనంగఁ

జలువలు వెదచల్లు జవ్వాదితావి
పలుకెంపు బలుకెంపుబవడంపుమోవి
విడియంపు[1] చాయలు వెదచల్లఁ దుదల
నిడువాలుఁ గన్నుల నిద్దురమంపు
తడఁబడఁ బెనఁగొన్న తారహారములు

ముడివడి జాఱిన ముడిపూలసరులు
చిన్నారి జిలిబిలి చెమటచేఁ గరఁగి
తిన్నగా జాఱిన తిలకరేఖయును
బిసరుహాలోచన పెనఁకువవలనఁ
బసిపట్టు[2] సరిగ దుప్పటి వలెవాటు

నాదిగాఁగల సురతాంతచిహ్నములఁ
బ్రాదుర్భవించిన పంచాస్త్రుఁ డనఁగ

1. విడెకెంపు. 2. బసపట్టు.

నావిభుం డరుణోదయమునకు మున్నె
వేవేగ నగరుఁ బ్రవేశించె నంత
జవరాలితోఁ గూడి జనపతి రేయిఁ

బవళించి యున్నట్టి పానుపువిరుల
వేఁకువ నుడిగంపు వెలఁదులు దెచ్చి
యాకడఁ జల్లిన ట్లడఁగెఁ దారకలు
కలువలచెలికాఁడు[1] గగనమార్గమునఁ
బలుమఱు వెడల[2] భూభాగంబు వెదుక[1]

జోకగా[3] వచ్చిన చుక్కలో యనఁగ
వేఁకువ దీపముల్ వెలవెలనయ్యెఁ
బ్రతిభచే సకలభూభరణంబుచేత
నతిశయింపుచును మా కపరాధిపైన
యాపన్నగస్వామి నధరీకరించె

నీపార్థివుండని యిచ్చలో నెంచి
జనపాలకుని గతిశ్రమము వారింపఁ
జనుదెంచెనన మించెఁ జలువతెమ్మెరలు
కలువలు వాడె జక్కవకవగూడెఁ
బులుగులు మెలఁగె నంబుజములు చెలఁగెఁ

గటికిచీఁకటి దీఱెఁ గంతుఁడు జాఱె
విటజాల మళికెఁ గ్రొవ్విరిదేనె లొలికెఁ
దుమ్మెదల్ ఘోషించెఁ దొలుసంజ మించెఁ

1. కలువలచెలికాని. 2. వేడుక. 3, జోకగా

గొమ్మల నెడసి చకోరముల్ జడిసెఁ
గవఁ బాసి కామినీకాముకుల్ జనఁగ

దివసవికాసంబు దీపించె నంతఁ
జిత్రరేఖను రాత్రిఁ జేపట్టినట్టి
ధాత్రీశ్వరుని వినోదములు వ్రాయించి
చారుకళంకలాక్షారసంబునను
దీరుగా ముద్రించి దినసరికమ్మఁ

గ్రమమునఁ బడుమటి కడలిరాయలకు
సమయచారుఁడు గొంచుఁజను.........

రఘునాథనాయకాభ్యుదయమునందు

తృతీయాశ్వాసము అసంపూర్ణముఁ

శ్రీరస్తు

# రఘునాథాభ్యుదయము

సీ. భోజకన్యాముఖాంభోజరాజమరాళ
సత్యాఘనస్తనస్తబకభృంగ
జాంబవతీవిలోచనచకోరశశాంక
మిత్రవిందాతటిన్మేఘరూప
భద్రావశావశాభద్రదంతావళ
వరసుదంతామనోవనమృగేంద్ర
లక్షణారూపకలాపిపర్జన్య
భానుసుతాలతాపారిజాత

గీ. షోడశస్త్రీసహస్రచక్షుఃప్రసార
హారసారమసారమోహనశరీర[1]
విజయరాఘవభూపాలభజనలోల
కేలు మోడ్చెద రాజగోపాల నీకు.

కైవారం. శ్రీరాజగోపాలచరణారవిందభజనానందసాంద్ర, రఘునాథనాయకరత్నరత్నాకరావతీర్ణసంపూర్ణ, పాండ్యతుండీరాదివైరివీరగజకంఠీరవకిశోర, కళావత్యంబికాకుమార, చంద్రోపేంద్రసురేంద్రనందనకందర్పకోటిసౌందర్యధుర్య, జీర్ణకర్ణాటకసామ్రాజ్యసంస్థాపనాచార్య, సమసమయసమాచరితసమస్తనిస్తులతులాపురుషాదిమహాదానాపదానప్రవర్తితకీర్తిధారేయ, సంగరరంగగాంగేయ (? ద్విజ*)సహస్రాభీష్ట

1. హారసారమరాసారమోహనశరీరం

మృష్టాన్నదానదీక్షాధురీణ, మానినీనూతనపంచబాణ, విశ్వ విశ్వంభరాభారభరణవిచక్షణదక్షిణభుజాదండ, శాశ్వతైశ్వ ర్యధౌరంధర్య....సింహాసనపట్టభద్ర, కలియుగరామభద్ర, జనకచరణసమవిధాయుక్త, విజయరాఘవనాయక, పరాకు స్వామి, మీరు హవణించిన రఘునాథాభ్యుదయ(? మును*) గనిపించ వినిపించేరు, చూడ నవధరింపుఁడ.

ద్వి. శ్రీరాజగోపాల చిరకీర్తిజాల
కారుణ్యగుణశీల కల్యాణలోల
గోవర్ధనోద్ధార గోపకుమార
భావజసమరూప [బహుళప్రతాప *]
నందగోపకుమార నవనీతచోర
చందనమందార సమకీర్తిహార
కరుణారసాపాంగ. గరుడతురంగ
పరమవచోవేద్య భవరోగవైద్య
దక్షిణద్వారకాస్థలకృతలీల
రక్షింప[ఁగదవయ్య *] [రాధి *]కాలోల

వాక్యం. అని విజయరాఘవభూపాలుండు రాజగోపాలస్వామినిఁ గొనియాడి యాదేవత పట్టభద్రుని పట్టంపుదేవిని యేమని ప్రశంసించీని.

ద్వి. కలశాంబునిధికన్య కల్యాణధన్య
సలలితసౌజన్య జగదేకమాన్య
వందారు శర్వాణి వారిజపాణి
మందరధరురాణి మధుకరవేణి

---

[*] ఈగుర్తుగలవి తాటియాకులలో శిథిలముకాఁగా బూర్తి చేసినవి.

పరమదయాలోక పాలితలోక
నిరతగజానీకనియాతాభిషేక
భారతీ [పార్వతీ భామలలో *]న
కోరినవర మిచ్చు కువలయనయన
శ్రీచెంగమలవల్లి చెలువైన తల్లి
కాచి రక్షింపవే కనకాంగవల్లి.

వా. అని యిష్టదేవతాప్రార్థనంబుఁ గావించి యాం.........
ద్యనిర్వాహణసమర్థుండైన విజయరాఘవపార్థివేంద్రుండు హావ
ణించిన రఘునాథనాయకాభ్యుదయనాటకంబునకు సంవిధానం
బెటువలెను.

దరువు - సౌరాష్ట్రరాగము - ఏకాతాళము.

తిరుగఁ దాల్చిన దివ్యరత్నపు సొమ్ము
లారజప్రతాపుల యరవిరుల్ గాఁగ
శ్రీరాజగోపాలకారుణ్యరసమున
పేరైన భూలో............

పల్లవి. గుజరాతి కెంపుల కొలువుకూటముఁ జేరె
విజయరాఘవశౌరి విభవజంభారి.

జొదలఁ జెక్కిన యాణిముత్యపుతురా
మీఁదనున్న ధ్రువు............
......ధ్రువ జిమ్మటి కాల్వయై రాణింప
మేదిని నడయాడు మేరువో యనఁగ.

సన్నజాజివిరుల సవరించిన బంతి
వన్నెమీఱంగాఁ దన వలకేల నుంచి

చిన్నారి వలముం.........ల్చిన
మన్నారుదేవుఁ డీ మన్నెసింహ మనఁగ.

వా. ఇవ్విధంబున వచ్చిన విజయరాఘవపట్టభద్రుండు భద్ర సింహాసనాసీనుండైన క్రమ మెటువలెను.

ఇవ్విధంబున మితపరిజనంబులు గొలువఁ గొలువై యున్న విజయరాఘవేంద్రుని సముఖంబునకుఁ దాతయాచార్యమూర్ధన్యుండు వచ్చెనఁట యెటువలెను.

దరువు - భైరవిరాగము - ఏకతాళము.

తిరుమణి ధరియించి తిరుచూర్ణము దిద్ది
తిరుమణివడములు దీపించఁగాఁ
గరమునఁ బద్మాక్షసరము నటింపంగా
సరగునఁ దాతయాచార్యులు వచ్చె.

వన్నెగాఁ బౌండరీకవాజపేయాదులైన
జన్నము లెల్ల సేసి సమ్మదమున
వెన్నెలచాయల వెలిగొడుగులనీడ
సన్నుతి కెక్కి[న] తాతాచార్యులు వచ్చె.

వా. ఇవ్విధంబున వచ్చిన యాచార్యుల చరణారవిందంబులకు వందనంబుఁ గావించి, అతని నర్ధాసనంబున నుంచి, తానును గూర్చున్న క్రమ మెటువలెను.

ఆసమయంబున విజయరాఘవసార్వభౌముండు నాఁటి యరుణోదయావసరంబునఁ గాంచిన స్వప్నవృత్తాంతంబు

చింతించి ఆచార్యుల నీక్షించి వర్షాసమయసంభూతనవాంభో
ధరగంభీరస్వరనిగుంభనవిజృంభణంబుతో నేమనుచున్నాఁడు.*

ద్వి. అలఘుతపోధుర్య యాచార్యవర్య
కలగంటి వినవయ్య కల్యాణశీల
నిన్న రే యొకవింత నీటు మీఱంగఁ
గన్నపాయమువాఁడు కందర్ప[కోటి *]
[లావణ్యలీలా *]విలాసంబువాఁడు
మోవిపైఁ జిఱునవ్వు మొలకలవాఁడు
జగజంపు నెత్తావి సంపంగిదండ
సొగసుగా సిగనిండఁ జుట్టినవాఁడు
కరుణారసము చిల్కు కడకంటిచూ[పు]
[బురణింప నొక *]మహాపురుషశేఖరుఁడు
సకలభూషావిశేషములు ధరించి
యొకచెల్వ గొల్వ నాయొద్దికి వచ్చి
విజయరాఘవ వత్స వినుము మామాట
భజియింపుచును మమ్ముఁ బ్రతివత్సరంబు
నిర్భరభక్తితో నీవు హిరణ్య
గర్భదానంబులు గావిం[చువేళ *][1]
చనుబాలుఁ గ్రోలించి చాల లాలించి
తొలుదొల్త నీమేని దురితంబు లెల్లఁ
దొలఁగించి రాజ్యంబు ధ్రువముగా నొసఁగి
సొంపున నిను దయఁ జూచు పురాణ
దంపతులము నీకుఁ దల్లిదండ్రులము

---

* ఈ వచనమునకు దిగువ (...చదివేది) అని కలదు.

1. ఇచ్చటినుండి ద్విపదకావ్యములోని రెండవ చరణము లింద లేవు.

విరవాదితావులు విరిసినరీతి
సరసవాక్యంబుల సరణులు మీఱఁ
బదములు మంజరిప్రముఖకావ్యములు
మొదల మా కంకితంబులు సేసి తీవు
నీరచనకు మెచ్చి నీకు దీర్ఘాయు
రారోగ్యభాగ్యంబు లవు డొసంగితిమి
ధీచతురానన ద్విపదకావ్యంబు
నీచేత నందుకో నేఁడు వచ్చితిమి
మాయవతారమై మహి నుదయించి
మీాయయ్యయై ధైర్యమేరువై మించి
యఘటనఘటనాసమర్థుఁడై వెలయు
రఘునాథమేదినీరమణుని చర్య
ధీకౌశలము మించ ద్విపదఁ గావించి
మా కంకితము సేసి మనుము వేయేండ్లు
అని పల్కి యవు డా దయాపయోరాశి
ననుఁ గటాక్షించి యంతర్హితుం డయ్యె.

వా. అని విన్నవింప నానందించి, ఆ నందనందనచరణారవింద మిళిందాయమానమానసాంభోజుని విజయరాఘవభోజునిఁ జూచి ఆచార్యు లేమనుచున్నారు.

ద్వి. భుజవిక్రమాధార భోజావతార
విజయరాఘవధీర వీరాధివీర
వినవయ్య మీావంశవిస్తార మెల్ల
వినిపింతు నీకును విస్తరఫణితి
వనజాక్షుపదముల వఱలు వాహినికి

ననుజయ్యె మించు నాలవజాతి జగతి
నాజాతిలోఁ జాల నధికులై నట్టి
రాజులుఁ గొందఱు ప్రఖ్యాతిఁ గనిరి
వారిలోఁ గృష్ణభూవరుఁడు లావణ్య
కారుణ్యగుణముల ఘనకీర్తిఁ గాంచె
అమ్మహామహునకు నాత్మజుండైన
తిమ్మభూపాలుండు ధీరత వెలసి
బయ్యాంబిక వరించి ప్రౌఢి వహించె
నయ్యిరువురుఁ గాంచి రాత్మసంభవులఁ
బెదచెవ్వభూపాలుఁ బినచెవ్వవిభునిఁ
బెదమల్లభూజానిఁ బినమల్లనృపతి
వారిలోఁ బినచెవ్వవసుధాబలారి
మేరుధీరుఁడనంగ మేదిని వెలసెఁ
జిరతరంబుగ భక్తి శ్రీశైలమందు
అరుణాచలమున వృద్ధాచలంబునను
శంకరార్పణముగా శాశ్వతానేక
కైంకర్యములఁ జేసి ఘనకీర్తిఁ గాంచె
సుగుణసంతతికి నచ్యుతరాయసతికిఁ
దగిన సోదరి కృశోదరి మూర్తిమాంబ
యతనికి భార్యయై యఖిలభూపాల
సతులలో నార్యయై సన్నుతిఁ గాంచె
అచ్యుతేంద్రుఁడు వారి కాత్మజుం డగుచు
నచ్యుతుం డీతఁడె యని జను లెన్న
రంగధామునకు శ్రీరంగంబునందు

బంగారు సజ్జలుఁ బ్రాకారములును
రంగుమీఱు కిరీటరాజంబు మేలి
శృంగారవనములుఁ జెలువొందఁ జేసి
యెదిరిన మన్నీల నేపునఁ గదిసి
కదనంబులో గెల్చి కవ్వడి యనఁగ
సతికి భారతికి శ్రీసతి కరుంధతికిఁ
బ్రతివచ్చు మూర్తిమాంబను వరియించె
కౌసల్య దశరథక్ష్మారమణుండు
వాసి మీఱఁగ రఘూద్వహుఁ గన్నరీతి
అల మూర్తిమాంబయు నచ్యుతేంద్రుండు
నలవిభు రఘునాథనరనాథుఁ గనిరి
రసికుఁ డా యచ్యుత రఘునాథవిభుఁడు
వసుమతీరాజ్యనిర్వాహకుఁ డగుచు
తుండీరవీరునిం దురములోఁ దఱిమి
చెండించి ఖండించె జగ్గభూవిభుని
ఆలంబు సేసి పాండ్యావనీనాథు
పాళెంబు డాసి తద్బాలికామణుల
మొఱవెట్టఁగాఁ దన మూకలచేతఁ
జెఱవట్టి తెప్పించి చెలఁగెనాపట్ల
మన్నారు మీయయ్య మాయవతార
మన్నమాట యథార్థ మగు నైన వినుము
ఆయవతారవిహారంబుకన్న
నీయవతారమం దిదికదా వింత
జలకేళి సవరించు జలజలోచనల

వలువ లా మన్నారు పంచించి తెచ్చె
రణకేళి సవరించు రాజులసతుల
మణుఁగులఁ దెచ్చె నిమ్మనుజేశ్వరుండు
ఇంతమాత్రముదక్క నీయిద్దతికిని
వింత యే మున్నది వెండియు నితఁడు
చెలఁగుచు ఘనగిరిసింహాసనమున
అల రామదేవరాయలఁ దెచ్చి నిలిపె
ఆదరంబునఁ బదియాఱు దానములు
వేదకోవిదులైన విప్రుల కొసఁగి
కోదండదీక్షాధిగురుఁడైన రాముఁ
డే దైవ మని యెంచు నెంచఁ డన్యులను
ఆరఘునాథనాయకశిరోమణికి
నారీలలామమై నారాయణునకుఁ
బట్టఁపురాణియై పాలమున్నీటి
పట్టికి సాటియై పరమకల్యాణి
గుణరత్నఖని యని కోవిదు లొప్పగడఁ
బ్రణుతిఁ గైకొని వెంపరాజచంద్రునకుఁ
బరగ లక్ష్మాంబకుఁ బట్టియై పుట్టి
పరమపతివ్రతా[భరణమై *] మించు
లావణ్యవతికిఁ గళావతీసతికి
నావిర్భవించి నీ వభివృద్ధి నొంది
విజయరాఘవనామవిఖ్యాతిఁ గాంచి
నిజభుజంబున నుర్వి నిర్వహించితివి
కరులు మూడనినాఁడె గుఱిదొర లొప్పగడ

దురములోఁ బడుమటి దొరను గెల్చితివి
పట్టాభిషేకవై భవముఁ గైకొన్న
యట్టిసంవత్సరమం దొకనాఁట
నవలీలఁగాఁ బదిమూఁటు దానములు
సవరించి ద్విజుల కొసంగితి వీవు
వీరుఁడౌ సవరము వేంకటపతిని
పాఱఁదోలించి నీపనుపులచేతఁ[1]
బట్టిన సీమలోఁ బందనెల్లూరు
కట్టించితివి ఘటికామాత్రమున నె
శ్రీరంగరాయలఁ జేపట్టి నిల్పి
యా రాయకార్యంబు లాఁ గా దటంచు
దుండగించిన పాండ్య తుండీరపతుల
ఖండించి వాకిలిఁ గాపఁజేసితివి
తడ లేని మృష్టాన్నదానసత్రములు
నడపుచున్నాఁడవు నానాఁట హెచ్చ
రత్నాంగియుఁ గిరీటరాజంబు దివ్య
రత్నభూషణములు రథగజాశ్వములు
ప్రాకారగోపురప్రాసాదములును
వైకుంఠసభ పుష్పవనతటాకములు
ప్రకటించి రాజగోపాలదేవునకు
సకలకైంకర్యముల్ సంఘటించితివి
నవనవంబుగ రఘునాథపురాది
వివిధాగ్రహారముల్ వెలయఁ జేసితివి

---

1. పంపులచేతఁ

ఏకాలమును దండ్రియే దైవ మనుచుఁ
జేకొని పూజలు చేసెద వీవు
కావున నీ నడకకు మెచ్చి యిష్ట
దైవమా దక్షిణద్వారకావిభుఁడు
నీకుఁ బ్రసన్నుఁడై నీవు గావించు
నాకావ్య మందుదుఁకని యానతిచ్చె
మన్ననారనుమతి మా యనుమతియుఁ
గన్నావు గనుక నాకనకాంబరునకుఁ
దారహారముగ మీతండ్రిచారిత్ర
మారూఢిఁ ద్విపదకావ్యము సేయవయ్య.

వా. ఇవ్విధంబునఁ బ్రబంధనిబంధంబున కనుగ్రహించి యతని యనుజ్ఞ గాంచి ఆచార్యులు నిజమందిరంబు ప్రవేశించిరఁట యేఁటువలెను.

ద్వి. సాక్షాత్కరించి ప్రసన్నుఁడై యున్న
దక్షిణద్వారకాధ్యక్షుఁడై మించు
తిరుమలశ్రీతాతదేశికోత్తముఁడు
కరుణను ననుమతిఁ గావించెఁ గనుక
వరవైఖరుల నేను వర్ణింపఁబూను
చరితంబు మద్గురుచరితంబె గనుకఁ
దండ్రికన్నను వేఱె దైవంబు లేద
టండ్రు భూసురులు నే నది మది నెంచి
ఘనవచోరచన సత్కవిరాజు లెల్లఁ
గొనియాడ నేఁడు మత్కులదైవమైన
జలధరసచ్ఛాత్ర (?)చారుగాత్రునకు

జలజాతపత్ర[1]విశాలనేత్రునకు
దక్షిణద్వారకాస్థలమందిరునకు
వక్షస్థలావాసవలదిందిరునకుఁ
బరమవైష్ణవతపోభాగధేయునకు
నరకిన్నరస్తుతనామధేయునకు
నవనార్వా(?)శకటదానవవిజయునకు
సవిధసేవావిచక్షణవిజయునకు
[ఫణిరాజ*]శాయికిఁ బరమకల్యాణ
గుణశీలునకు రాజగోపాలునకును
అంకితంబుగ మనోహరవచోరచన
లంకరింపఁగ నేను హవణింపఁబూను
నవ్యమౌ రఘునాథనాయకాభ్యుదయ
కావ్యంబునకుఁ గథాక్రమ మెట్టి దనిన.

వా. ఇవ్విధంబున నిజదేశికనిదేశంబు ప్రకాశింప విజయరాఘున కుంభినీజంభారి తా నారంభించిన కథాసంవిధానంబు నటింప నటనటీజనుల నియోగించి, త దాలోకనాయత్తచిత్తుండై, నిండు గొలువైయుండెనఁట యెట్టువలెను.

ఇత్తెఱంగున నుత్తరంగితచిత్తుండై విజయరాఘవస్వామి యమోఘవచోవైఖరి నేకరింప హవణించిన కథాసంవిధానంబునకుఁ బ్రథమకథనీయంబగు పురం బెట్టి దనిన.

పదము - సౌరాష్ట్రి రాగము - త్రిపుడ.

శ్రీకరంబై సకలభువనవశీకరంబై రిపునృపాలక
భీకరంబై సంపదకు రత్నాకరంబై.

1. జలజాతమిత్ర

తీరుగా నమరావతీపురి మీఱుగా యని జనులుఁ బొగడఁగఁ
జారుగాథల తంజకాపురి పేరు గాంచుఁ.

త్రిపురంబు రమావధూటికి కాపురంబై పలుకుఁజెలువకు
దాపురంబై తనరు భూసతినూపురంబై.

హాటకంబుల సుభటరథగజఘోటకంబుల విటవిటీనట
నాటకంబుల నొప్పు పురిశృంగాటకంబుల్.

వా. అన్నగరంబున కధీశ్వరుండైన రఘునాథభూమండలాఖండ
లుండు నిండువేడుకఁ బొంగారఁ గొలువు సింగారంబై యింది
రామందిరంబునకు వచ్చెనట యెటువలెను.

ద్వి. నిలువుటద్దం బొక నెలఁతుక దాల్ప
తలఁ పెఱింగి కడాని తట్టల సొమ్ము
కందళించిన వేడ్కఁ గరములఁ బూని
ముందఱ బొక్కసంబులవారు నిల్వ
సంపంగిపూవుల సరములు చుట్టి
సొంపు రాణింపఁగా సుప్పాణి గొప్ప
ముత్యాల కుళ్లాయి మోహనలీల
ముత్యపుమురువులు మురువుగాఁ బూని
నిద్దంపుఁ జెక్కుల నీడలు తేఱ
పెద్దచౌకట్టులు ప్రియముతోఁ బూని
యవిరళనవకుంకుమాంగరాగంబు
సవరించి వీనుల జవ్వాది నించి
సరిగముత్యపుకుట్టు చంటిపై నొరయ
హారువైన పైఠిణీ యంచుచట్టఁ దొడిగి

బంగారు చుంగులు పైమిటారింప
రంగైన పీతాంబరము కటిఁ గట్టి
కంటి కింపై మించు కంఠమాలికలు
కంటసరంబును గడువేడ్కఁ బూని
చెలువైన వజ్రాల చేసరుల్ కెంపు
కళుకుల మేరువు కడియముల్ దాల్చి
సరిలేని నవరత్నసంఘసంఘటనఁ
బురుణింపఁగా బాహుపురులు ధరించి
అకలంక(నూత్న)రత్నాంగుళీయములు
చికిలి వైడూర్యంపుఁ జేయంబుఁ బూని
పరగ పాండ్యనృపాలఫాలపట్టమున
మురువైన నవరత్నములఁ దీరినట్టి
బిరుదు పెండేరంపు పెరిమె దీపింపఁ
జరణాంబుజంబున సవరించి యిట్లు
కొలువు సింగారమై కోటికందర్ప
లలితలావణ్యవిలాసుఁడై వచ్చె.

ఎఱుకల కాంబోది – ఆదితాళము.

పల్లవి. రామావతారుండు రఘునాథధీరుం డభి
రామమగా యిందిరామందిరము ఁజేరవచ్చె.

ఎలమితో విజయరాఘవేంద్రుని గాంచిన
లలన కళావతమ్మ లక్ష్మమ్మ కొల్వ.
ఎలవంక బలవంక నలరు రుక్మిణీసత్యలు
గొలువంగ వచ్చు రాజగోపాలుఁ డనఁగ,

వా. ఈరీతిఁ జేరిన రఘునాథశౌరి మెఱుపుమంచంబు[1]మీఁదఁ గూర్చున్న క్రమ మెట్టువలెను.

ఈరీతి మెఱుపుమంచంబుమీఁదఁ గూర్చున్న తండ్రిపాలికి వచ్చి విజయరాఘవభూపాలుం డతని చరణారవిందంబులకు వందనంబుఁ గావించెనట యెట్టువలెను.

ఇవ్విధంబున వందనంబుఁ జేసిన నందనుఁ జూచి రఘునాథ భూపాలుం డేమనుచున్నాఁడు.

రఘునాథనాయనివారిమాట :—రావోయి! కుమారకం ఠీరవ! మదీయవంశమేరువ! ఈ చేరువఁ గూర్చుండవోయి.

వా. అనుసమయంబున, అంతఃపురకాంతలు అమ్మహీకాంతుని సమ్ముఖమ్మునకు వచ్చేక్రమ మెట్టువలెను.

కల్యాణిరాగము - అటతాళము.

మదవతు లిందిరామందిరంబున నున్న
హృదయేశ్వరుని కొల్వఁ కేతెంచి రఘుడు.

వా. ఇవ్విధంబునఁ జేరిన జవ్వను లవ్విభునకుఁ దమతమ విద్యలు వినిపించిన వరుస ద్విపదమార్గంబున వక్కాణించిన క్రమ మెట్టువలెను.

ద్వి. బిరుదుపాత్రలు విజృంభించి యారాజ
వరునిముందఱ నిల్వ[2] వారిలోపలను
బదచాళిఁ గొనియె రూపవతీవధూటి
కొదలేక పేరణిఁ గొనె చంద్రరేఖ
మిక్కిలికోపుల మెఱవడిఁ జూపి[3]

1. మెఱుపుమంచంబు 2. నిల్వ 3. జూపె

జక్కిణి వినుపించె శశిరేఖ యపుడు
ననఁబోఁడియగు లోకనాయికాకాంత
వనజలోచన కీరవాణి లతాంగి
దురపదకేళిక దురుసైన కోపు
వరుస నటించిరి వన్నెమీఱఁగను
కొరవంజి శివలీల గుజరాతిదేశి
విరిబోండ్లు కొందఱు వినిపించి రపుడు
భువి మెచ్చ నచ్యుతాభ్యుదయకావ్యంబు
నవరసచిత్రంబు నలచరిత్రంబు
హరువైవ పారిజాతాహరణంబు
మెఱపడఁ జూపు వాల్మీకి చరిత్ర
జానకీకల్యాణచాటుకావ్యంబు
తా నిర్వహించిన తక్కిన కృతులు
కొందఱు వినిపింపఁ గొందఱు తగిన
సందర్భమున సమస్యలు సేకరింప
నెదుట సంగీత సాహిత్యనాట్యములు
మొదలైన విద్యలు మూర్తీభవించె
నన మించు నల చంచలాక్షు లందఱును
వినిపింపఁద్రొణఁగిరి విద్య లన్నియును.

వా. వారిలో నొక్కవారిజలోచన నవరసాస్పదంబుగాఁ బదకేళిక వినుపించెనట యెటువలెను. (సరిపోయినపదం వినిపించేది). అప్పు డొక్కజక్కవగుబ్బెత జానకీకల్యాణంబు వినిపించెనట యెటువలెను.

వేఱొకకోరకస్తని వాల్మీకిచరిత్ర విచిత్రంబుగా వినిపించెనట యెటువలెను.

ఇవ్విధంబున విద్యలు వినిపించిన జవ్వనుల కవ్వసుంధరాధీశ్వరుండు తాంబూలజాంబూనదాంబరంబులు పాలించి లాలించి పంపిన అయ్యింతు లంతఃపురంబుఁ బ్రవేశించిరంట యెటువలెను.

అయ్యవసరంబున నవసరంబులవా రావారాశిగభీరుని సమ్ముఖంబునకు వచ్చిరఁట యెటువలెను.

దరువు - ముఖారిరాగం - అటతాళం.

తళుకుబంగరుజీని తట్ట చేపట్టి
చలువదుస్తులు సవరణచేసి
అళుకుతో వచ్చిరి అవసరమ్ములవారు
వెలినుండి రఘునాథవిభుని చెంగటికి.

వా. ఇవ్విధంబున వచ్చి అచ్యుతరఘునాథస్వామికి నేమని విన్నవించేరు.

ద్వి. శకసింధు గాంధార సౌవీర చేర
కుకురు కాశ కరూశ కోస లావంతి
నేపాళ పాండ్య తుండీరాదిసకల
భూపాలకులు కవిపుంగవుల్ బుధులు
దొరలు మన్నీలు మంత్రులు పురోహితులు
కరణికుల్ వాకిటఁ గాచియున్నారు
సమ్మదంబున స్వామి సమ్ముఖమ్మునకు
రమ్మని పిలుతుమా రాజదేవేంద్ర!

వా. అని విన్నవించి యన్నరేంద్రచంద్రుని కనుసన్న లెఱింగి అవసరంబులవారు పిలువఁ గొలువుబడివారు కొలువుకు వచ్చేక్రమ మెటువలెను.

దరువు – కన్నడరాగం – ఆదితాళం

వలువపంచెమీఁద చారి కట్టిన సరిగ
జిలుగుదుప్పటిచుంగు జీరాడఁగాఁ
జెలువంబు మీఱంగ శ్రీరఘునాథుని
కొలువుకు వచ్చిరి గుఱిదొర లెల్ల.

వా. అవురా! ఈరీతిఁ జేరవచ్చిన దొరలు ఆరాజన్యమూర్ధన్యునిం బొడగనిరఁట యెటువలెను.

ఇవ్విధంబునఁ బొడగని వారిలోఁ దగినవా రతనియనుమతినుచితాసనాసీనులైరఁట యెటువలెను.

ఆసమయంబున నావిద్వత్ప్రభుశిఖామణిసముఖంబునకు విద్వత్కవీంద్రులు వచ్చిరఁట యెటువలెను.

దరువు – పంతువరాళిరాగం – ఏకతాళి.

పరకాళియంగీలు పట్టుపచ్చడములు
.........రెపుటంపు క (కు?) ళ్లాయిలు
కరమున దర్భముళ్లు కనకపొంగళ్లు (?) బూని
గరిమతో వచ్చిరి కవిబుధోత్తములు.

వా. ఇవ్విధంబున వచ్చిన విశిష్టవిద్వద్వర్గ్యులష్టభాషాకవిసార్వభౌము లాసభానాయకుని నాశీర్వదించిరఁట యెటువలెను.

"ఆయురారోగ్యపుత్రార్థః మంగళాని[చ*] భవంతు."

ఇటువలె నాశీర్వదించి యాసార్వభౌముని యనుజ్ఞఁ గాంచి తమ తమ మొఱ లెఱింగించి కుఱంగటఁ[1] గూర్చుండి శాస్త్ర చర్చ నడిపించిరఁట యెటువలెను.

ఆరఘునాథ భూపాలచంద్రుండు విద్వత్కవీంద్రులం జూచి యేమనుచున్నాఁడు.

రఘునాథనాయనివారిమాట :— వింటిరా! కవులార! ఈపడుచు లాంధ్ర గీర్వాణ ప్రాకృత సమస్యలు పూరింపఁగోరు చున్నారు. వీరినిఁ బరీక్షింపరయ్యా.

వా. అన విని యమ్మహారాజుతోఁ గవిరాజు లేమనుచున్నారు.

"అయ్యయ్యో స్వామి నగర లక్ష్మీసరస్వతులు సాక్షా త్కరించియుండఁగఁ బరీక్షయేలయ్యా? అయినను మీ రాన తిచ్చిన మీఱరాదుగద. ఈకమలాస్యలకు సమస్యలు ఇచ్చే మయ్యా."

అని సమస్యలు ఇచ్చిరఁట యెటువలెను.

సమస్య : "రారాజని యచ్యుతేంద్రు రఘునాథనృపా."

వా. ఔరా! రామభద్రమ్మవారు ఆసమస్య పూరించి చదివి రఁట యెటువలెను.

కం. ఎరీ నీ సరిరాజులు
భూరమణులు నిన్నుఁ జాలఁ బొగడుదురు భళీ!
స్వారాజని రేరాజని
రారాజని యచ్యుతేంద్రు రఘునాథనృపా.

---

1. యురంగట.

వా. ఔరా! ఈపద్యంబు విని యాంధ్రకవితా నిర్వహణంబునకు మెచ్చి గీర్వాణభాషను సమస్య నిచ్చిరఁట యెటువలెను.

సమస్య: "కిం తే సంతానపాదపాయం తే."

వా. అవురా! యాశుకవితావాణియగు నాశుకవాణి యీ సమస్య పూరించి చదివెనఁట యెటువలెను.

శ్లో. కతికతినక్షితిపతయః
కిం తే రఘునాథనాయకాయం తే
భువి బహవః కిల తరవః
కిం తే సంతానపాదపాయం తే.

వా. అవురా! ఈరీతి సంస్కృతసమస్య పూరించి చదివిన విని మెచ్చి ఆరామభద్రమ్మకు మధురవాణమ్మకు వేర్వేఱ ప్రాకృత సమస్య లిచ్చిరఁట యెటువలెను.

౧. సమస్య: "రహుణాహక్ఖితిచందిరో విహాఇ."

౨. సమస్య: "వడ్ఢఇ రహుణాహరాయ పాహూోహి."

వా. అవురా! ఆరెండుసమస్యలు వారు పూరించి చదివిరఁట యెటువలెను.

శ్లో. పరిపుణ్ణకళాహి సోహమాణో
అహియంసక్కుళణిచ్చ సెవ్వమాణో
సహిఎ (స?). చెందిఆఒ
రహుణాహక్ఖితిచందిరో విహాఇ.[1]

---

1. పరిపూర్ణకలాభి శోభమానః
అభితః (?) సత్కులనిత్యసేవ్యమానః
సఖి! య (శః?). చంద్రికాఢ్యో
రఘునాథక్షితిచంద్రో విభాతి ॥

వా. అవురా ఆ(రెండవ*) సమస్య పూరించిచదివెనఁట యెటు వలెను.

సమస్య: తెల్లొక్కేక్క సుహావహాసుహాయర
విజయరాహవం సఇణం
దెఠ్ఠూణ ణియతణాయం
వడ్ఢయి రహుణాహరాయ పాహోహి[1].

వా. భళి! భళి! మేలు! మేలు! సారస్వతసామ్రాజ్యపట్టభద్ర! ఈమహామహిమంబు స్వామినగరిఁ గాక తక్కినరాణువల (?) నెక్కడిదయ్యా?

ఆసమయంబున ఆయసమానతేజోనిధిసమ్ముఖంబునకు రాయసములవారు వచ్చిరఁట యెటువలెను.

దరువు – బిలహరిరాగం – ఆదితాళము.

వెరవు మీఱ దినసరు లోడినుంచి గంటంపు
దుర(టొఱ ?) చల్వదుప్పటి పారలోనఁ జెక్కి
గరిమతో వచ్చిరి కై కానుకలు గొంచు
సరసులైన రాయసమ్ములవారు.

వా. ఇవ్విధంబున వచ్చిన రాయసమ్ములవారినిం జూచి రఘునాథభూపాలుం డేమనుచున్నాఁడు.

---

1. త్రైలోక్యైక సుఖావహ
శుభకర విజయరాఘవం శశినం
దృష్ట్వా నిజతనూజం
వర్ధతే రఘునాథరాజపాథోధిః ॥

పైశ్లోకమున శుభకర యనుటకు మాఱుగా సుఖకర యనికాని, సుఖచర యని కాని యుండవచ్చును.

పై ప్రాకృత శ్లోకములకు సంస్కృతచ్ఛాయ నిచ్చియు, వానిని సంస్కృత శ్లోకములను సవరించి పెట్టియు సాయపడిన డాక్టరు వి. రాఘవన్ గారికి నా కృతజ్ఞతాపూర్వక వందనములు.

ద్వి. తేలుపుఁడేనైనను దిక్కుల కార్య
ములు వ్రాసినచ్చెనా మొన్న నిన్నటను.

వా. అని పలుకు రఘునాథజననాథునకుఁ బ్రధానులు సమయ కథానుగుణసుధామధురోక్తుల కార్యాంశంబులు వినిపించి దిన సరులు చదివిరఁట యెటువలెను.

కమ్మవక్కణ :—

ద్వి. శ్రీమన్మహాచోళసింహాసనంది
రామనోహరులైన రఘునాథనాయ
నయ్యవారికి నుత్తరాది గుంటూరి
యయ్యపరసుని నారప్ప విన్నపము
లంచిత నళవత్స రాషాఢ శుద్ధ
పంచమీపుష్యార్క పరిఘుయోగమున
స్వామివారా పళవానేరినగర
నామతీర్థము పురాణశ్రవణంబు
రామవిగ్రహపూజ రామజపంబు
శ్రీమూర్తిదానాద్యశేషదానములుఁ
గావించి విజయంబుఁ గలుగ నక్షతలు
శ్రీవైష్ణవు లొసంగ శిరమునం దాల్చి
“ఆదిత్యహృదయ”జపానంతరమున
నైదాఱు గడియలయపు డారగించి
భేరులు మ్రోయించి పెండ్లికిఁ బోవు
తీరునఁ దగిన ముస్తీదుఁ గావించి
యెదుటిపాళెంబున కెఱుక సేయించి
కదలి వచ్చి విజయగరుడాద్రి నెక్కి

రామభద్రగజాధిరాజంబు నెక్కి
రామభద్రకుమారరత్నంబు కొలువ
మతిశాలి పురుషోత్తమయ నరసప్ప
జతఁ గూడిన గరిమజాలశీల్[1] గనుక
నెదు రెచ్చరింపుచు నేకపార్శ్వమున
మదగజం బెక్కి సమ్మదమున నడవ
అస్తెప్ప యళగప్ప యాప్తులై యొక్క
మస్తేన్గుపై నెక్కి మక్కువ నడవ
రాజులు మన్నీలు రౌతులు దొరలు
తేజీలపై నెక్కి ధీరులై కొలువఁ
జేరువ నొకగంధసింధురం బెక్కి
ఆరామదేవరాయలు చనుదేరఁ
దరతరమ్ములకును దగులైన కతన
నెర నమ్మఁదగిన కోనేటి కొండ్రాజు
కట్ట రంగపురాజు కస్తూరిరాజు
మిట్టపాళెంపు సంపెట నాగరాజు
రామరాజుల యాకు రఘునాథరాజు
మామ యొబళరాజు మనుబోలురాజు
శ్రీరంగపతిరాజు శ్రీగిరిరాజు
వీరరాఘవరాజు విఠ్ఠలరాజు
నందేల చిట్రాజు నారపరాజు
కందనవోల్ రాజు గడితిమ్మరాజు
కాలువరాజులు కడపరాజులును
బాళేలరాజులు పంటరాజులును

1. మదాలశీల్.

శ్రీపతివారు[1] కై జీతంపు దొరలు
జూపల్లివారు దేసురిరెడ్ల తెగలు
మామ మూర్తెప్ప కుమారరంగయ్య
పామినాయనివారు బలుమూరివారు
మండువవారు కంబము కొండవీటి
కొండపల్ రెడ్లు నంకుశరావువారు
నొదల పచ్చి మల్లప......టి గంటి
మాదన సేపెరుమా మొదలారి(?)
మొదలైన గుఱిదొరల్ ముందఱ నడవఁ
గదనరంగమునకుఁ గదలిపోవుటకు
నేడెనిమిదివేల యొలగోలు ప్రజల
కాడియపాదము నధిపతిం జేసి
చివగడల్ కైదువుల్ సెలవు సేయించి
సవరణతో నేఱుఁ జాలఁ గప్పించి
భ్రమసిన పడుమటి పాళెంబుమీఁద
దుమికి హుటాహుటి దొక్కొని నడవ
అమ్ములచేతఁ జేయమ్ములచేత
దుమ్ములచేత దోదుమ్ములచేత
బల్లేలచేతఁ దుపాకులచేత
నల్లమూఁకలచేత నడగొండలైన
మత్తేభములచేత మావులచేత
కత్తులచేతఁ జీకాకు సేయింపఁ
బోరిలో సమసె గొబ్బురి జగ్గరాజు

1. శ్రీపతిరాజు అని పాఠాంతరము.

పారె మూఁకలవెంటఁబడి మూఁకరాజన్యమో
దగఁదొట్టి వగఁబుట్టి దళవాయి చెంచు
సిగ విడి తెగ జాఱఁ జింతింప కేగె
నుడివోయి యోటుకాఁ డూఁడనిఁబాఁడె

విడివడి పాఱె రావిళ్ళ మాదన్న
మధురవారినిఁగూర్చి మ మ్మింత చేసె
విధి యంచుఁ దనపాలి విధి దూఱుకొనుచు
దొరలెల్ల నవ్వంగఁ దుండీరవిభుఁడు
పరువెత్తెఁ దన చెంజి పట్టణంబునకు
తిరువందినాపిళ్ల తిత్తెసెపట్టి
పురము తిమ్మానేఁడు భుజబలరావు
చినరాతు యెత్తుమసెట్టిలోనైన
తనయొద్ది దొరలెల్లఁ దను డించి పాఱ
నింతుల నెడఁబాసి యిలు చూఱ యిచ్చి
సంతరించిన బొక్కసము వీటఁబుచ్చి
తురగంబు డిగ్గి కైదువఁ బాఱవైచి
విఱిగి పాఱఁదొడంగె వీరపనేఁడు
జయలక్ష్మి చేపట్టి స్వామివా రపుడు
దయ మీఱఁగా ధర్మదార పట్టించి
బంగారు బొమ్మను పాండ్యభూపాలుఁ
డింగితవేదియై యిచ్చిన మెచ్చి
తంజాపురము చేరి తనవంశవజ్ర
పంజరంబై సార్వభౌమసామ్రాజ్య
లక్షణంబులతో కళావతీసతియుఁ
గుక్షిసంభవ రాజగోపాలుఁ డనగ:

విజయసంధాయియై వెలయుచునున్న
విజయరాఘవనామవిఖ్యాతిఁ గాంచి
యామహూర్తమునఁ బట్టాభిరామాభి
రామమై మించు శ్రీరామసౌధమునఁ
జలువరాజగతిపై జాళువా పసిఁడి
పలకల గొప్ప చప్పరములోఁ జేరి
పేరోలగంబున్నఁ బెద్దమ్మవార
లారతు లెత్తినారని వ్రాసి రాఁగఁ
గొలువులోఁ జదివించుకొని స్వామివారి
బలపౌరుషము లెంచి పాచ్ఛావువారు
సమయోచితోక్తులఁ జాల లాలించి
తమముద్రచేఁ గాగితము శిఖాచేసి
ఘనముగా మీఁ కుడుగరలు గట్టించి
హనుమోజిపంతుల నంపించినారు
ఎటువలె నడచిన దిక్కడి కార్య
మటుగాన నెఱిగుండ నవధరించేది.

వా. ఆ సమయంబునఁ గరణికు లాభరణచరణపరిచరణ శాలి (?)[1] పాలికి వచ్చిరఁట యెటువలెను.

దరువు – సావేరిరాగము – అటతాళం.

పటికముల కర్ణికల్ బలపముల్ కడితముల్
బటువైన కుళ్లాయిపై పాగలు
కుటిలవార్తలు మించఁ గొందఱు కరణికుల్
నటనతో వచ్చిరి నరనాథుకడకు.

---

1. గరణికు :గా రఘుకులాభరణచరణపరిచరణశాలి అని యుండదగును.

వా. వచ్చి అచ్యుత రఘునాథభూపాలుని సముఖంబున ఆయ వ్యయసంఖ్యాకథనపురస్సరంబుగాఁ బరస్పరవివాదంబులు సలిపిరఁట యెటువలెను.

అట్టవణ రంగయ లెక్క వినిపించేది :— చిదంబరనాథ మొదలాదిమీఁద ధర్మాసనం మూడులక్షల మాళ్ళకు చెల్లు రెండు లక్షలున్ను ముప్పై అయిదువేలు కాక పార్వ(ర్శ్వ?) నిల్వ పదిహేనువేలున్ను శుద్ధ నిల్వ యాభై వేలున్ను అంతు నిల్వ అఱువై అయిదువే.. కుబుసం లక్ష్మయమీఁద మణియం మనోవర్తి రెండు లక్షలున్ను యాభై వేలకు రొఖ్ఖం చెల్లు లక్షా యాభై వే., ధాన్యాన చెల్లు యాభై వేలు, అంతు రెండు లక్షలు కాక నిల్వ యాభై వేలు. వాచమూటిమీఁద కరతోరలు లక్షవరహాలకు రొఖ్ఖం చెల్లు యెనభై వేలు కాక నిల్వ యిరవై వేలు. కోనేరిపిళ్ళమీఁద సుంకం పద్దెనిమిది వేలకు చెల్లు పండ్రెండువేలు కాక నిల్వ ఆఱువేలమాళ్లు; అంతు నిల్వ లక్షా నలభై యొకవేల మాళ్లు.

అని యీతీరున లెక్క వినిపించిన అట్టవరణ రంగయతోను కస్తూరి ప్రత్యుత్తర మిచ్చిన క్రమ మెటువలెను.

కస్తూరిమాట :— ఏనయ్య రంగయ్య ధర్మాసన మొదలాద లెక్క సముఖదల్లి హేళిదెల్ల శాను వెలి. అవరవరు హిడిదలంచ, పరిధానవహేళ బేడాయందు నినగె అవరవరు ప్రియ హేళిద్దు, నా నరియునే.

అని యీతీరున కస్తూరి అన్నందుకు అట్టవణ రంగయ ప్రత్యుత్తర మిచ్చేక్రమ మెటువలెను.

అట్టవణ రంగయ :— నీనేనుబల్లెయయ్యా, అంథాద్దు ఉంటాదరె రూపిసు. యేను బగుళుతిద్దియ.

ఈ ఉద్దఱి పరస్పరవివాదమున్ను విని చిదంబరనాథ మొదలారి మందలించే క్రమ మెటువలెను.

చిదంబరనాథ మొదలారి :— సముఖత్తిలె నీంగ శేళ్ అడిచ్చిపడ్రీన్, ఎల్లాం కర్త్తాక్కళ్ చిత్త మరియుం. సుమ్మా యిరుంగో.

వా. ఔరా! వారి వివాదంబు విని రఘునాథభూపాలుం డేమను చున్నాఁడు. రావోయి అస్తెప్పదీక్షితులవారితోఁ జెప్పి లేఖలు పరామర్శించుమనవోయి.

వా. ఈరీతిఁ బేరోలగం బుండి, కొంతసేపు రాణువ కార్యంబులు మణాయించి హాసమువారినిం బంచి, స్వారిఁబోవ నుత్స హించి, యంత నంతఃపురముఁ బ్రవేశించిరఁట యెటువలెను.

ఇవ్విధంబున నమ్మహీకాంతుం డంతఃపురముఁ బ్రవేశించి యారగించి, శతపదంబులు త్రొక్కి, బాలరామాయణముఁ బఠించి, తాంబూలచర్వణముఁ గావించి, ఘటికాచతుష్టయ మాత్రంబు మృదుశయ్యపై నిదురించి, మేలుకాంచి, స్వారిఁ బోవ నుత్సహించి రాణువవారి కెచ్చరింప నన్నగారినిం బంప నతండు వచ్చేక్రమ మెటువలెను.

దరువు - శంకరాభరణంరాగం - ఆదితాళం.

నేమముతోడను మోముసఁ దీర్చిన

నామము తిరుచూర్ణము మించంగా

ఆమాపటివేళ నన్నగారు వచ్చె
వేమఱు బెత్తంబు విసరుచు నపుడు.

వా. వచ్చి రావణువారి నెచ్చరించే క్రమ మెటువలెను.

ఓహూ, దొరలారా అయ్యా స్వారి వస్తున్నాఁడు. గొబ్బున ఆయిత్తపడి గుఱ్ఱా లెక్కి రారోయి!

వా. అని రాణువదొరల నాకర్ణించి హర్షంబుతో వర్షధరుండు మరలెనఁట యెటువలెను.

అంత రఘునాథమేదినీకాంతుండు వింత సంతసపసుల మించు కక్ష్యాంతరంబులు గడచి వింతగా కై సేసినభద్రదంతావళం బెక్కి, అంతఃపురము వెడలి రాణువదొరలతో కుమార వర్గంబుతో రాజమార్గంబున స్వారివచ్చెనఁట యెటువలెను.

దరువు.........

శ్రీరఘునాథుండు శృంగారశాలియై
స్వారి వెడలివచ్చె చౌదంతి నెక్కి.

తేజీలపై నెక్కి నేజలు చేఁబూని
రాజాధిరాజులు రౌతులు కొల్వ
రాజవదనలు నీరాజనము లెత్తఁగా
రాజవీథివెంట వచ్చె రాజస మమర.

బలవంతులైనట్టి ప్రద్యుమ్న సాంబులు
గొలువంగ వచ్చు రాజగోపాలుం డనఁగ
విలసిల్లు రామభద్ర విజయరాఘవేంద్రులు
ఎలవంక బలవంక నెనసి కొల్వంగను.

సరిలేని మకర శంఖ చక్ర కేతనములు
సురుమాయి జల్లులు సూర్యచంద్రులును
గరుడధ్వజాదులైన బిరుదులు పట్టంగా
సురలు గొల్వంగ వచ్చు సురరాజుకరణి.

వా. ఈరీతి స్వారి వచ్చిన యారాజచూడామణిని జూడఁగోరి పౌరనారీమణులు మణిసౌధంబు లెక్కి చేతు లెత్తి మ్రొక్కి యతని రూపరేఖలకు సొక్కి సేసలు చల్లిరంట యెటువలెను.

వారిలో నొక్క వారిజలోచన ఆరాజకందర్పుని సౌందర్య విలాసంబులు సందర్శించి పరమానందంబుఁ జెంది కందర్పుని కెందలిరాకుతూఁపునఁ గసికందిన డెందంబుతోఁ గంది, ఆరూపపాంచాలుని వెడందకన్నులును,తళుకులు దేఱు నిద్దంపుఁజెక్కులును, సురశాఖిశాఖలకు జోడైన భుజము, లరుణాబ్జముల మించు హస్తయుగ్మంబు, పాంచజన్యమురీతిం బరగు కంఠంబు, కాంచనోరుకవాటగతి మించు నురము, సైకతస్థలికన్నఁ జదురైన జఘన, మాకరికరముల నదలించు తొడలు, లలిత మహారాజలక్షణంబులను జెలువారు పాదరాజీవయుగ్మంబు మొదలైన యవయవమ్ములచేతఁ దనకు ముద మొదవించు నమ్మోహనాకారు మదనావతారు మన్నెహంవీరుఁ గదలక జాలమార్గమ్మునం జూచి, సంతసంబున మహాశ్చర్యంబు నొంది యంతరంగమున నిట్లు వితర్కించె.

ద్వి. ఇంతటి వాని నే నెందునుం గాన
కంతుఁ డీమేదినీకాంతుని కెనయె
చక్కనివారిలోఁ జక్కనివాఁడు
సొక్కరె యీతనిం జూచిన చెలులు.

వా. అని తెప్పవేయక యందందఁ జూచి మనమున హర్షించి మఱియు నిట్లనియె.

అనికి తురంగసాది నారాచతరంగంబుల సురంగంబుఁ ద్రవ్వి యంతరంగపుకోట నూటాడింప నాపాటలగంధి ధైర్యపాటవంబుఁ బోమీటి యారాజకిరీటిపై నాటిన తలంపు చలింపనీక యేమని వితర్కించుచున్నది.

ద్వి. ప్రేమతో నీరాజు బిగువుకౌఁగిటను
వేమఱు మరుకేళి విహరించు చెలులు
ఏనోము నోచిరో యేదైవములను
బూని పూజించిరో పూర్వజన్మమున
నీరాజకందర్పుఁ డింపు సొంపారఁ
జేర రమ్మని పిల్చి చేపట్టి నన్ను
మోము మోమునఁ జేర్చి మోవి యానుచును
ప్రేమతోఁ గౌఁగిటఁ బెనఁగు టెన్నటికిఁ
దళుకుఁజెక్కిలి నొక్కి తమిమీఱ సొక్కి
యెలమి పుక్కిటి విడె మిచ్చు టెన్నటికిఁ
గురులు నున్నగ దువ్వి కొప్పమరించి
విరులు దిండుగఁ జుట్టి వేడుక మీఱఁ
గలపంబు నెమ్మేనఁ గలయంగ నలఁది
తిలకంబు కొనగోరఁ దీరుగా దిద్ది
కళ లంటి సొక్కించి కరఁగించి కరఁగి
కులుకుగుబ్బలఁ జేతి కూడు టెన్నటికి.

వా. అని వితర్కించు సమయమున కొమ్మపై కమ్మవిల్కాఁడు ధాడివచ్చెనఁట యెట్టువలెను,

ద్వి. కోకోకమునఁ జాల గుఱిపడ్డరాతు
చక్కెరఖాణంపు సామ్రాణి నెక్కి
యంచలనున్న రాయంచబొదలను
జంచరీకమ్ములఁ జలువతెమ్మెరల
గోరవంకలను గండుఁగోయిలగముల
నిరువంకఁ బురికొల్పి యింతిపై నపుడు
కండచక్కెరవిల్లు కరమునం బట్టి
గండుతుమ్మెదనారి గట్టి మోపెట్టి
అలరులగన్నెరాకమ్ము సంధించి
కులుకుగుబ్బెత నేసి కోయని యార్చె.

వా. ఈరీతి నారీతిలకంబు మన్మథపారవశ్యంబుఁ జెందిన తెఱం గెఱింగి మెఱుంగుఁబోణు లాకురంగలోచనం దోడ్కొని కుఱంగట శృంగారవనంబునకు వచ్చి యచ్చట నామచ్చెకంటికిఁ బ్రొద్దుపోకగా సుద్దులాడుచు వనవిహారంబు సలిపిరఁట యెటువలెను.

పదం : ఘంటారవం – ఆదితాళం.

కన్నెలఁ బాయకు సన్నలు సేయకు పొన్నల చాయకుఁ
బోదము రావె
క్రేవలఁ బెంచిన మావులు వంచిన పూవులు త్రుంచినఁ
బ్రొద్దుపోదఁటవె
ఈరము లన్నఁ గాసారము లన్నఁ గీరము లన్నను గినిసెద
వదేమె
పారిజాతము లన్న వారిజాతము లన్న వారిగీతము లన్న
వలసి చల్లములె (?)

ఆటలఁ జూడవు బోటులఁ గూడవు పాటలు పాడవు భామ
యిదేమె
ఇంతుల రమ్మని వంతుల కమ్మని బంతులు తెమ్మని పలుక
వదేమె.

వా. అని పలుకు చెలుల పలుకులు విననొల్లక యాయల్లకభరంబున భూవల్లభచిత్తజుని హత్తించిన చిత్తంబు మరలింపనేరక వనితల పేరఁ జేరక వనవిహారంబుఁ గోరక లతాగృహంబులు దూరక లవంగకుడుంగంబులఁ జేరక యూరక యాకోరక స్తనిసితకపోలయై నృపాలుపై మేలు జాలుఁవారఁ జాల పారవశ్యంబు మీఱ నేమని తక్కించుచున్నది.

మధ్యమాది రాగం - అటతాళం.

ఏల స్వారి వచ్చె రఘునాథభూ
పాలుండు రూపపాంచాలుండు నేఁడు.

మదగజంబు నెక్కి మన్నెహంవీరుండు
మదిరాక్షి యీప్రొద్దు కదలిరానేల.

కదలి వచ్చిననేమి కడమవీధులఁ బోక
మదనావతారుండు మావీధివెంట.

ఈరాజవీధిలో స్వారి వచ్చిననేమి
మేర మీఱి నేను మేడపైఁ జేరి

ఆరఘునాథుని యందచందములు
సోరణగండ్లను జూడ నేమిటికి.

చూచిన నేమాయెఁ జూచి చూడకమున్నె
నాచిత్త మతనిపై నాట నేమిటికి;

ఆచందమామయ్య యల్లుఁ డింతలోనె
ఈచందమున నన్నేఁచ నేమిటికి.

మరులుకొంటినంత మరుఁ డేఁచెనంట
నరనాయకున కెవ్వ రెఱుక సేసేరు

ఎఱుక సేసిన నేయింతుల మెచ్చని
దొర నేఁడు నన్నేల సరకుసేసీని.

వా. అని పలికి యొకలికిచిలుకలకొలికి యొకచెలినింజూచి యేమనుచున్నది.

పదం ......

రమణి నాభాగ్యమునకు రాజగోపాలు దూఱనేల
రమణుం డెన్నఁడైన నన్ను రాపు సేసీనా.

వేగమున వలరాజు విరిదూపులకుఁ దాళక
జాగు సేయక పొదరింటి చాటున నే నిల్వ
దాఁగఁబోయినచోటఁ దలవరు లున్నట్లు
బాగుగా విరులు నాపై రాలెనమ్మ.

కొదమచిలుకపలుకులకుఁ గొమ్మ నే తాళలేక
ఒదిగి యొకమావిదండ నుండఁబోతేను
సుదతిరో 'యిలుకులో షో' కన్నచందమున
పదరి గండుఁగోయిల వదరసాగెనమ్మ.

వా. అని యొకచిత్రరేఖ రఘునాథభూపాలుని యందచందంబులు లిఖించిన చిత్రపటముఁ జూచి యేమనుచున్నది.

కాంబోజి - ఏకతాళం.

పల్లవి ఏమి సేతురా నే నేమిసేతురా
ఏమి సేతురా రఘునాథస్వామి నెంతురా.

చెలువరాయనిరూపు సేవించినప్పుడే
మరుఁడు వెలిగుడారు వేయించెరా
కండచక్కెరవిలునారి మ్రోయించెరా
తా నేలిన దళముల మొన సేయించెరా.—ఏమి.

రామావతార నీ మోముఁ జూపినప్పుడె,
ఆమని మచ్చరించెరా
ఈప్రొద్దు చందమామ హెచ్చరించెరా, రా
చిలుక లేమో సుద్దు లుచ్చరించెరా.—ఏమి.

నారీపాంచాల నీవు న న్నేల్లనివాఁడవు —మా
కెరి(?)దోవ స్వారివత్తురా
నీనగరి నున్నవారు నన్నుఁ జేరనిత్తురా
ఓయిటువంటి, మొఱ లెవ్వరైన మెత్తురా ?

వా. అని యానీలాలక భూపాలునిపై మేలు జాలువాఱ మ
ఱియు నే మనుచున్నది.

పదం......

ప్రతిమను గానైతిగా, నేరతనాల ప్రతిమను గానైతిగా
ప్రతిమనైతే వాని పాదాంగదంబున[1]
కుతుకంబుతో నుంటి కొలువు సేయుదుగా.

1. పాదాంగతంబుగ

తాళిని గానైతిగా నే శ్రీరామ తాళిని గానైతిగా
తాళినినైతే యాదక్షిణసామ్రాజ్య
మేలు భూపాలుని ఎదపైఁ జేరాడుదుగా.

విరిబంతిఁ గానైతిగా, వానిచేతి విరిబంతిఁ గానైతిగా
విరిబంతినైతే యూదోర నన్నుమూర్కొను
తఱి వాని కెమ్మోవితావిఁ గ్రోలుదుగా.

అద్దముఁ గానైతిగా, నే నిల్వుటద్దముఁ గానైతిగా
అద్దమైతే వాని ముద్దుమోమునీడ
కొద్దికయైన నే నొద్ద నుండుదుగా.

శయ్యను గానైతిగా, నే నరవిరిశయ్యను గానైతిగా
శయ్యనైతే యాసరసుండు నామీఁద
బియ్యముగాఁ బవళింప నుండుదుగా.

వా. అని యాలోచనసేయు నాలోలలోచన విరహసూచనలు తెలిసి కలసి నెచ్చెలులు[1] శీతాంశువదన మదనవేదన తీఱ శిశిరోపచారంబులు సేయ నుద్యోగించి యొక రొకరినిం జూచి యేమనుచున్నారు. ఎటువలెను.

దరువు.........

కలకంఠకంఠికి గంబూరదీవిపై
అలరులపానుపు హావణింపరమ్మ.

జలజాక్షిగుబ్బల చలువగంద మలంది[2]
చెలులార పన్నీరు చిలికింపరమ్మ.

---

1. కుచలల. 2. గందమునించి.

చలువమీఱంగ ఘనసారకంకణము లీ
యలివేణికరముల హత్తించరమ్మ.
నలినాక్షికిఁ బద్మనాళహారంబులు
కులుకుగుబ్బలమీఁదఁ గూర్పరోయమ్మ.
సన్నజాజివిరుల చలువదుప్పటిఁ దెచ్చి
కన్నియనెమ్మేనఁ గప్పరోయమ్మ.
చిన్నారి పొన్నారి చిగురాకు సురఁటుల
విన్నాణముగఁ జేసి వీవరోయమ్మ.

వా. అని శీతలవస్తుజాలంబుల శీతాంశువదనకు సేయుశీతలోపచారంబులఁ జేతోజాతానలజ్వాలలు చల్లారకున్న నాఫుల్లారవిందలోచనలు తమలోఁ దా మిట్లనుచున్నారు.

ద్వి. చెలులార మనము చేసిన చల్వ లెల్లఁ
గలికితాపముఁ దీర్పఁగాఁ జాలవయ్యెఁ
జెఱకువిల్తుని పూజ సేయక మనము
పారదోలంబోవఁ బోవునే[1] కాఁక
అని నిశ్చయించి వారంద ఱచ్చెలిని
కనికరంబునఁ జేరి కని కరంబునను
జాఱుఁబయ్యెదకొంగు సవరించి గోర
సారెకు నెఱికురుల్ చక్కఁగా దువ్వి
అక్కునఁ జేర్చి యూరార్చి యోయమ్మ
చక్కెరఖాణంపు సామ్రాణిదొరను
నేఁడు పూజింపుమా నీమనోరథము
లీడేర్చు నతఁడు నీ కేల చింతింప.

1. పారదోవఁబోయిన పోవునే.

వా. అని రాజబింబాననలు రతిరాజపూజావిధానంబు హావణిం చినక్రమ మెటువలెను.

ద్వి. అని మందలించి నెయ్యము కందళింప
ఘనసారకదళికాకాంతారమునను
పరపైన ద్రాక్షచప్పరములోపలను
విరివియగా పుష్పాడి వేదియమీఁద
కమ్మదామరముద్దెగద్దియపైని
ఘుమ్మను మొగలిరేకుపటంబు నిల్పి
బాలికల్ మృగనాభిపంకంబులోన
వాలారుఁ గొనగోరు వాగఱ నద్ది
రతిమన్మథుల వ్రాసి రతిరాజుచెంత
ఋతురాజు రేరాజు నిరుగడ వ్రాసి
వారికిఁ జుట్టును వలికరువలిని
గీర మయూర కోకిల మరాళాది
బలముల లిఖయించి భజనకుం దగిన
ఫల జల కుసుమాది బహుళవస్తువులు
జీని తట్టల నించి చెంగట నుంచి
యాగీలకుంతల నటకుఁ దోతెచ్చి
మదనునియెదుట సమ్మదమున నిల్ప.

వా. ఇవ్విధంబునఁ దోడితెచ్చి మదవతులు మదగజగమనను మదనునియెదుట నిల్పిరఁట యెవటులెను.

ఈరీతి నారీతిలకంబు సఖీజనసమానీతయై చేతోజాతప్రతి మాసాన్నిధ్యంబుఁ జేరి యొక్కచొక్కపుఁ గమ్మదమ్మి

గ్రొవ్విరిఁ గేలఁ గీలించి మన్మథమూర్తిని భావించి, యావాహ
నంబుఁ గావించి యేమనుచున్నది.

పూజావిధానము :

కమలాకుమార! నీ కిదే కమలకర్ణికాసింహాసనంబు
అసమకుసుమసాయక! నీ కివే యర్ఘ్యపాద్యాచమనంబులు
పంచబాణధురీణ! నీ కివే పంచామృతశుద్ధోద
కాభిషేకంబులు
భావసంభవ! నీ కివే పరిధానోత్తరీయంబులు
హరినందన! నీ కిదే హరిచందన కుంకుమసంకుమదపంకంబు
వారిజాతాయుధ! నీ కివే పారిజాతకుసుమదామంబులు
రత్నాకరదౌహిత్ర! నీ కివే రత్నభూషావిశేషంబులు
తుంటవింటియొంటరి నెఱదంటబంట! నీ కివే ధూప
దీపంబులు
మకరధ్వజలాంఛన! నీ కివే మందారఫలోపహారంబులు
రేరాజుమేనల్లుఁడ! నీ కిదే నీరాజనంబు
దక్షిణగంధవాహావాహ![1] నీకివే ప్రదక్షిణనమస్కారంబులు
పుష్పకోదండపాండిత్యశాలి! నీ కిదే పుష్పాంజలి.

వా. అని రాజబింబానన రతిరాజ పూజఁగావించి యేమని
ప్రార్థించుచున్నది.

దరువు – రేవగుప్తి – ఆదితాళం

కేసరివిక్రమక్రీడలవాని
నీసరివచ్చు నానృపశిఖామణిని

1. దక్షిణగంధవాహావాహావాహ.

రాజుల రాజైన రఘునాథవిభుని
నోజమీఱఁగ నేఁ డొనగూర్పు మదన.

వా. ఇవ్విధంబున రసదాడివిలుకాని వేడి, అతని వాడితూపుల వేఁడిమి హెచ్చఁగనకకఁ గాంగి యాచెలువసింగాణిరాయల నుద్దేశించి యేమనుచున్నది.

దరువు - యదుకులకాంభోజి - ఆదితాళం.

పల్లవి. భళి భళి నే నెంత ప్రార్థనసేసినఁ
దలిరువింటిరాయ! దయ రాదాయె.
తెలివితో దేహంబుఁ దెలియఁజాలనివాఁడు
వెలఁదుల సుద్దులు విననేర్చునేరా.
పంకజసాయక! బధిరునిముందఱ
సంకు వినిపించిన చందమాయెఁగదరా.

వా. అని యాచందనగంధి చందమామయల్లుని దూఱి చందమామనుద్దేశించి యే మనుచున్నది.

దరువు - మనోహరి - ఏకతాళం.

నానాథుఁడు రఘునాథుఁడని విననేరా
నీనిశాచరవృత్తి మానరా చంద్ర!
జానకి నేఁచిన యానిశాచరరాజు
తా నేమి యయ్యెనో తలఁచుకోరాదా?

వా. అని వనజారిని దూఱి యామిటారి పటీరాచలకుటీరవిహారంబునఁ దుటారించు సమీరకిశోరంబుల నేమని దూఱుచున్నది.

దరువు.........

మలయపవన నీవు నా ప్రాణమని మనసులో నమ్మియుంటిగా
తలిరువింటిబోయఁ గూడి దాడివచ్చె నేమి సేతు.[1]

వా. అని మలయసమీరణు నిందఁ గావించి యావారణరాజ యాన దారుణవచనంబులు పలుకు కలికిచిలుకలఁ జూచి యే మనుచున్నది.

దరువు.........

పక్షపాతము గల్గు బలగంబు లనుచు
రక్షింతుగా మిమ్ము[2] రాచిల్కలార
ఇక్షుకోదండధరుఁ డేఁచు వేళను
పక్షపాతము లేక పలుకఁగాఁదగవె?[3]

వా. అని కందర్పమందానిలాదుల నిందించి, ఆచందనగంధి యేవేల్పుల భావింతు, నేతపంబుఁ గావింతు, నేయర్థంబు సమర్థింతు, నేయింటిసిం బ్రార్థింతు, సప్తార్థివచంద్రుని రప్పించువా రెవ్వారు, ఈబారిఁ దప్పించువా రెవ్వారు, ప్రాణదాన మిప్పించువా రెవ్వారని యవ్వీరునిపై హత్తిన చిత్తంబు మరలింపనేరక తెరలుచుం బొరలుచున్న తరళలోచనం జూచి యొకకీరవాణి యే మనుచున్నది.

దరువు – సావేరి – ఆదితాళం.

చిలుక తేజియఁట చెఱకఁట విల్లు
భళి భళి తుమ్మెదపౌఁజట నారి

1. దాడివచ్చి తేమిసేతు.
2. మమ్ము
3. పక్షపాతము లేక పలుకుట తగవె.

చెంగల్వవిరులఁట చేనున్నతూపు
లంగంబు లేనివాఁడఁట యేటుకాఁడు
ఆయమ్మలెవ్వారి యాయమ్మనాటు
నోయమ్మ యిటువంటి యూహాలుగలవె.

వా. అని తనవల పాఱడిఁబెట్టి కేరడంబులాడుచు నూరడింపవి పీడిఁడిచెలుల ధిక్కరించి యక్కరిరాజగమన విరహాశమనంబునకై యొక్కసంపంగిగుంపుదండనుండి యిందుమనంబున నేమని తర్కించుచున్నది.

పదం - కాంబోజి - అటతాళం.

ప. తుమ్మెద నంపుదునో నే నాడకు
తుమ్మెద నంపుదునో
తుమ్మెద నంపిన దొరచేత నున్నట్టి
కమ్మని విరిబంతిఁ గని మళ్లి రాదో.

ఎవ్వరి నంపుదునో వానియొద్ది
కెవ్వరి నంపుదునో
యెవ్వరి నంపిన యీరఘునాథుని
కెవ్వరు నాచంద మెఱుకసేసేరు.

గోరువంక నంపుదునో నే నాడకు
గోరువంక నంపుదునో
గోరువంక నంపిన గొబ్బునఁ బోయి యా
దొరవంక సుద్దులు దొరకొని రాదో.

రాయంచ నంపుదునో నే నాడకు
రాయంచ నంపుదునో

1. చేపట్టిన తూపులెల్ల

రాయంచ నంపిన రఘునాథునియొద్ది
రాయంచగమనలు రానీరేమొ.

రాచిల్క నంపుదునో నే నాడకు
రాచిల్క నంపుదునో
రాచిల్క నంపిన రాజమందిరమున
నేచంద్రముఖిమోవిఁ జూచి రాదేమొ.

వా. అని యాలోలలోచన యాలోచనంబు చేసి అతని సమయంబుఁ దెలిసి రమ్మని యొకకొమ్మనుఁ జూచి యేమను చున్నది.

దరువు -

పల్లవి సుదతి రఘునాథనాయని సమయమేమో చూచి రావమ్మ.
పదం. ఎలమి పాండ్యభూపాలుని యింతులఁ బట్టి తెచ్చి
సెలవుసేసెనో తనచెలులకు సెలవుసేసెనో.

నారిజ మొదలయిన నాగసహస్రముల సారెకు
సెలవుసేసెనో, తన సేవకులకు (సారెకు) సెలవుసేసెనో

విజయకారణముగ వెలసిన పుత్రునికి
విజయరాఘవనామకరణము సేసెనో

తుండీరభూపాలుని దుర్గములు గొట్టించి[1]
అండనున్న దొరలకు హవాలుసేసెనో

శరణన్న నేపాళజగతినాయకునకు
దొరతనముఁ బాలించు సమయమో.

---

1. గట్టించి.

వా. అని పలుకుసమయమునఁ గుటిలాలకమనోరథంబు ఘటింపుమని పంచశరుండు పంచిన దూతిచందమున, నాతిడెంద మానందంబుఁ జెంద నొక రాచిల్క యాచిలుకలకొల్కి చెంగటికి వచ్చెనఁట యెటువలెను.

దరువు. .......

రాజదేవేంద్రునిరాక గోరుచున్న
రాజముఖిఁ జేరవచ్చె రాజకీర మప్పుడు.

వా. ఇవ్విధంబునవచ్చిన యచ్చిలుక చిలుకలకొల్కి ముంజేతిపై వ్రాలి యోలీలావతీ ఈచందంబునఁ గుందనేల అని మంలింప నాచందనగంధి ఆకందర్పుని తేజిసిం జూచి యే మనుచున్నది.

ద్వి. వింత యొక్కటిగంటి వింటివా చిలుక
సంతసంబున నేను సౌధంబుమీఁద
కొమ్మలు కొలువంగఁ గొలువున్న వేళ
కమ్మవిల్కాని చక్కఁదనంబువాఁడు
కర్ణాంతదీర్ఘమౌ కనుదోయివాఁడు
(పూర్ణేందుకళలను బోలుపొందువాఁడు *)
రసికుఁ డాయచ్యుత రఘునాథశౌరి
యసమానవైభవ మమరఁగా నేఁడు
రారాజువీఁటి యారాజమార్గమున
స్వారి రా నింకొకసారి రాఁగోరి
కన్నులపండువుగాఁ జూచుచుండఁ
గన్నులవిల్కాఁడు కడుఁగాసి చేసి

వేఁడిమిఁ జూప నావెతఁ జూడలేక
తోడిచెలుల్ నన్నుఁ దోడితే నిందుఁ
బలవింపఁగా నాదు భాగ్యంబుకతనఁ
జిలుక వచ్చితివి నా జీవ మిచ్చితివి
ఆదికాలంబున నానైషధునకు
నాదమయంతికి హంసదూత్యంబు
సవరించి కీర్తులు సంతరించుటయు[1]
భువనైకమాన్య యాభోజకన్యకకు
నవనీతచోరు మన్నారుఁ జేకూర్చి
భువి నొక్కద్విజరాజు పొగడొందుటయును
విన్నావు గనుక నావృత్తాంతమెల్లఁ
గన్నావు గనుక నాఘనమైన కాంక్షఁ
దీర్చు నుపాయంబుఁ దెలుపుమా నీవు
నేర్చిన నేర్పులు నేఁడు చూచెదను.

వా. అనిన శుకం బానుకవాణినిఁ జూచి యీ ననుచున్నది.

ద్వి. అనిశంబు నావంటి యనుఁగుఁజుట్టంబు
కనకాంగి కలుగంగఁ గలఁగంగ నేల
అపరంజి పంజరం బందు నన్నుంచి
కృపతోడ రతనాల గిన్నెలోపలను
గమ్మని పండ్లు పాల్ కండచక్కెరయు
సమ్మదమ్మున నిచ్చి సాకితి వీవు
ఇంతకాలంబు న న్నిట్లు పోషించు
టింతి యిప్పటికిఁగా కెప్పటికమ్మ

1. సంచరించుటయు

ననుఁ బంపవమ్మ యానరనాథుకడకు
మనసు రంజిల్ల నీ మనవులు తెలిపి
అచ్యుతేంద్రకుమారు నసహాయశూరు
నిచ్చటికేఁ దెత్తు నిదె పోయి వత్తు.

వా. అని రఘునాథభూపాలు నీపాలికిఁ దోడితెచ్చెదనని ప్రతిజ్ఞావచనంబులు వల్కి ప్రజ్ఞాధికంబగు శుకంబు శుకవాణి యనుజ్ఞఁ బడసి నడచెనఁట యెటువలెను.

ఆసమయంబున స్వారిఁబోయి వచ్చిన రఘునాథశౌరి నగరుఁ జేరి యారగించి హాసమువారితోఁ బేరోలగంబుండి[1] రాజకార్యంబులు మణాయించి రాణువవారినిం బంచి దినశేషంబు గడపి దినాంతవిధులు నడపి సమయోచితాంగరాగాది శృంగారవిధు లంగీకరించి యిందిరామందిరంబున నొప్పు గొప్పచప్పరమంచంబుమీఁద గూర్చుండి కపురంపువిడెంబు సేయుచున్న సమయంబున నమ్మహీకాంతుని సమ్ముఖంబున కంతఃపురకాంత లారతులు గొనివచ్చిరఁట యెటువలెను.

దరువు......

ఆరతుల్ గొనివచ్చి రంగనామణులు
ఆ రతిరాజమోహనమూర్తికడకు.

వా. అప్పు డా యారఘునాథశౌరి యారీతి నారీతిలకంబులతోఁ గొంతతడవు మంతనంబుసుద్దులఁ బ్రొద్దుఁ గడపుచుండి యంత నంతఃపురకాంతల వీడుకొల్పి, కొంద ఱాడిగంపుఁబడుచులు ముందు వెనుక సందడింప, మందిరారామంబుఁ జేరి యంట

1. హాసమువారిఁణ పేరోలగఁబుండి

విల్లు చేపట్టి, చూపట్టిన లక్ష్యంబు లేయుచు, వినవిహారంబు సేయుచు వచ్చి, యొకానొకపున్నాగతరుమూలవేదికాంతరంబున నిలిచి, ఆవింటికొప్పున హస్తంబుఁ జేర్చి, పూవింటిరాయల సోయగంబున నున్నసమయంబునఁ జిత్రరేఖ పంచిన చిలుక యాధాత్రీకళత్రుని సమ్ముఖంబునకు వచ్చెనంట యెటువలెను.

దరువు - ఆహరిరాగం - అటతాళం.

కీరంబు వచ్చె శృంగారవనంబులోఁ
జేరిన రఘునాథశౌరిచెంగటికి.

వా. ఇవ్విధంబున వచ్చిన కీర మాభూరమారమణుని హస్తంబుపై వ్రాలి, ప్రస్తుతవచనంబుల నే మనుచున్నది.

ద్వి. కల్యాణగుణశీల కరుణాలవాల
కల్యాణమగు నీకు కామినీమదన
నీ మోహనాకృతి నీ విలాసంబు
భూమిరాజులయందుఁ బొడఁగాన నేను[1]
ప్రభుశిఖామణియనఁ బ్రస్తుతికెక్కి
యభినవాంగజుఁడవై యవతరించితివి
నినుఁ గనుంగొనునట్టి నెలఁత కెంపైన
మనసు కరఁగకున్నె మదనావతార.

వా. అని పల్కు రాచిల్కకలికిపలుకుల కచ్చెరువంది యారాజకందర్పుఁ డేమనుచున్నాఁడు.

ద్వి. ఎవ్వరు పోషింతు రెచ్చట నుందు

1. బొడఁగాన నీకు.

వివ్వనంబునకు రా నేమి కారణము
రాచిల్క నవసుధారసధార లొలుక
మా చెవులకు నీదు మాట లింపయ్యె
నీవు వచ్చిన కార్య మెఱిఁగింపు నీకుఁ
గావలసిన కోర్కెఁ గావింతు నీకు[1]

వా. అని పల్క నాకారమన్మథునితో నాకీర మేమనుచు న్నది.

ద్వి. రాజకంఠీరవ రాజాధిరాజ
రాజన్యమూర్ధన్య రాజదేవేంద్ర
అమ్మఘవంతుని యాచార్యుఁడైన
మిమ్ము మాటలచేత మెప్పింపఁగలఁడె
అంతటివారు మీ రవకాశ మిచ్చి
వింతగా నాపల్కు వినఁగోరు టెల్ల
బళి బళీ నేఁడు నా భాగ్యంబుకాదె
తెలిపెద వినవయ్య ధీరవిచార
నేను వచ్చిన కార్య మెఱిఁగింపు మనుచు
నానతిచ్చితివి కార్యంబు ఫలించె
పాడి తప్పని పట్ట ? భద్రుండ వందు
రాడి తప్పని రాజ వందురు నిన్నుఁ
గాన నే వచ్చిన కార్యభారంబు
పూని తెల్పెద విను భువనైకవీర
ప్రజలెల్లఁ గొలువంగ రాజమార్గమున
గజరాజుపై నెక్కి గరిమతో మీరు
నెరరాజసంబున నేఁడు విచ్చేయ

1. కోర్కెగావింతు నిన్ను.

సరిలేని మణిసౌధజాలమార్గమున
మక్కువ మిముఁ జూచి మాచిత్రరేఖ
మిక్కిలి సొక్కి యామీనాంకు డేఁచ
శృంగారవనిఁ జేరి శృంగారవతులు
సంగతిగాఁ జేయు చలువలవలనఁ
గంతుసంతాపంబు కడతేఱకున్నఁ
గాంతను జూచి నే గనికరంబునను
జిన్ననాఁ డాదిగాఁ జెలిమితో నన్ను
మన్నించి పెంచిన[1] మన్నన లెంచి
కన్నెరో యేటికిఁ గందెద వన్న
నన్ను వీక్షించి యానారీలలామ
[సమ్ముదంబున మీరు స్వారివ*]చ్చుటయు
మిమ్ముఁ గన్గొని తాను మేల్పడుటయును
ఆదిగాఁ గలకార్య మంతయుఁ దెల్పి
యేది దిక్కని మది నెంతయుఁ గుంది
అందని మ్రానిపం డ్లాసించియున్న
యందంబుకాదె నే నతనిఁ[2] గోరుటలు
కోరిన నేమాయె కువలయపతులఁ
గోరి తెమ్మనునట్టి కొమ్మలు లేరె
కూరిమిమీఱఁగాఁ గోరిన పతిని
నేరుపుతోఁ దెచ్చు నెచ్చెలుల్ లేరె
అక్కటా నామోహ మా ఱడిఁబెట్టి
యెక్కడి వల పేది[3] యెక్కడి తలఁపు
అక్కరో చాలించు మని రింతెకాని
మక్కువఁ జెలులు నా మదనవేదనలు

---

1. పంచిన. 2. నతివ. 3. షేది.

తెలిసి నావిభుఁ దోడి తెచ్చెద మనుచు
భళి భళీ యొకమాట పలుకలేరైరి
అని వారిఁ దూఱి హంసాళిఁ గోకిలల
ననుపంగలేక న న్ననుపుచో మీకు
మాటిమాటికిఁ దన మనవు లన్నియును
బోఁటి[1] తెల్పు మటంచు బోధించి పంచె
మిమ్ము సారెకుఁ జూచి మీరూపరేఖ
నెమ్మదిలోపల నెలకొనఁ జేసె
నమ్మదంబున నున్న సమయంబుఁ జూచి
కమ్మ గేదఁగి నేజఁ గైకొని మరుఁడు
చేకొద్ది ననుఁ గుమ్మి చీకాకుచేసె
నోకృపానిధి యింక నోర్వలే నని యె
కనకాంగి రూపరేఖావిలాసములు
వనజాసనునికైన వర్ణింపఁదరమె
మరుని పట్టపుదంతి మరువంపు బంతి
తరుణుల మేల్‌బంతి తగు నీకె యింతి
ఆకన్ను లాచన్ను లావిలాసంబు
లాకుల్కు లాపల్కు లామిటారంబు
లానగ వాబిగు వారువారంబు
లానీటు లాపాట లావికాసంబు
లాచంద మాయంద మాయొయారంబు
నాచెల్వ మేచెల్వలందును[2] లేదు
ధరణీశ! యాయింతి దక్కిన నీకు
మఱివేఱె తక్కినమాట లింకేల

1. బొంది తెల్పుమటంచు.

2. నాచల్వ మేచల్వ లందము.

రాజశేఖర! మిమ్ము రసదృష్టిఁ జూచు[1]
రాజబింబాస్యపై రతిరాజు కినియఁ
జేపట్టక పరాకు చేసితి రేని
కోపింప(వలవ*) దాకోదవ యెవ్వరిది.

వా. అని మఱియు నే మనుచున్నది.

సౌరాష్ట్రరాగము - ఆదితాళం.

పల్లవి. రామావతార! యచ్యుత రఘునాథధీర!
భామనుఁ జేర రారా భావజాకార!

పదము. చుక్కలరాజును జుల్కనఁ జేయును
జక్కవగుబ్బెత చక్కనిమోము.

ఇరులకు నీలంపు సరులకుఁ దుమ్మెద
గఱులకు మాచెలి కురులకుఁ బోటీ.

ఏపునఁ గంతుని తూపనఁగాఁ జెలి
చూపనఁగా నొకరూపనఁ జెల్లు[2]

చిలుకల కపురంపుఁ బలుకుల రసదాడి
మొలకల మాచెలి పలుకులు[3] గెలుచు.

చెండ్లకు గజనిమ్మపండ్లకు బంగారు
గిండ్లకుఁ జెలిపాలిండ్లకుఁ జెలిమి.

వా. అని పల్కు రతిరాజుతేజితో రాజబిడౌజుం డేమనుచు
న్నాఁడు.

1. జూచి.
2. చూపనఁగారు నొకరూపనఁజెల్లు.
3. పలుకుల.

ద్వి. మీచెలి మామీఁద మే:[ల్పడె నను*]చు
నాచిత్తజుఁడు చాల నల్గినాఁ డనుచు
నమ్మిన కొమ్మపై ననవింటివాఁడు
దొమ్మిసేయ నుపేక్షతో నుంట మాకుఁ
దగవు కా దనుచు వార్తాచమత్కృతిని
మొగమొగంబున మమ్ము మోవనాడితివి
ఇక్షుశరాసనుం డేఁచ మీచెలిని
రక్షించుటయెమాకు రాజధర్మంబు
అన్నిటఁ జక్కనిదఁట యటమీఁద
మన్నన గలదఁట మామీఁదఁ జాల
నటమీఁద ద్విజరాజవగు నీవె వచ్చి
ఘటియింతువఁట యెట్లు కాదనవచ్చు.

వా, అని తన విన్నపం బంగీకరించిన నృపాలపుంగవునితోఁ
జెంగల్వసింగాణిరౌతుపటాణి యేమనుచున్నది.

ద్వి. భూపాలచంద్ర యద్భుత మిది కాదె
నేపాళ పాండ్య తుండీరాది రాజ
కన్యకామణులను గరుణాకటాక్ష
విన్యాసమున నైన వీక్షింపనట్టి
దక్షిణరాయమూర్ధన్యుఁడ వొక్క
పక్షిమాటలు విని పక్షీకరించి
మారుని కేళిని మాచిత్రరేఖ
నీ రేయిఁ జేపట్టి యేలెద ననుచు
నానతిచ్చితివన్న నన్నళినాక్షి
యేనోము నోచెనో యెంతపుణ్యంబొ
మత్తేభగామిని మనవి నేఁ దెల్పఁ

జిత్తగించి పరాకు సేయరా దీకను
అచ్యుతరఘునాథ యతిమోహనాంగ
విచ్చేయవలయు మా వెలదియింటికిని.

వా. అని విన్నవించినఁ బంచదారరతిబుగ్ సామ్రాణిఁ జూచి సామ్రాజ్యధౌరేయుం డోచిలుక! నీపలుకులు వింటిమి మీ చిలుకలకొల్కి మనవిం గైకొంటిమి. చంద్రికాసమయంబున మీచం[ద్రబింబా*] ననయింటికి మేమే వచ్చి పచ్చవిల్కాని కేలిఁ దేలింతుమని లాలించి పలికి మదవతికిఁ తన ముదలగా ముద్దుటుంగరముఁ బాలించి పంచినఁ గీరం బాశృంగార వనంబు వెడలి తనరా[క కెదురు*]చూచు రాకాసుధాకరముఖ చేత ప్రాలితాఁ బోయివచ్చిన తెఱం గెఱింగించి యుంగర మొసఁగి యేమనుచున్నది.

దరువు - ......

నీమందిరంబునకు నృపుండు [వచ్చే*] నన్నాఁడు
కొమరి నేఁడు నీ నోము ఫలించె.

వా. ఇవ్విధంబున నుంగర మొసంగ మెఱుంగుఁబోఁణి చేకొని కన్నుల నొత్తి చన్నుల హత్తించి శిరంబున నుంచి కరంబునఁ గీలించి, పులకలు మొలకలెత్తఁ గనుంగొలుకుల నానంద బాష్పంబు లొలుక, ఆకన్నులకలికి చిలుకను జూచి యేమని పలుకుచున్నది.

ద్వి. నాకోర్చు లీడేర్చి నాప్రాణవిభునిఁ
జేకూర్చి నన్ను రక్షించితి వీవు
సకులనెందఱనైన సంతరించితిని
పిక మరాళ మయూర భృంగసంతతులఁ

బోషించితిని నేఁడు పూవింటివాఁడు
ద్వేషింప నొకరైన దిక్కైరె నాకు
నిను సంతరించుట నేఁడు ఫలించె
[మనము*] రంజిల్లెను మన్నహంవీరు
సమయంబుఁ గనుఁగొని చనవునఁ జేరి
మమతతో నేఁడు నామనవులు తెలిపి
మానవాధిపుఁడు నా మందిరంబునకుఁ
దాన వచ్చుటకు నెంతయు నొడంబఱచి
నామీఁద దండెత్తి నడచినయట్టి
కాముని పాళెంబుఁ గడకుఁ దీయించు
ముద్రగా విభుచేతి ముద్రికఁ దెచ్చి
భద్రంబుగా నాకుఁ బాలించి తిపుడు
నీవు సేసిన మేలు నెమ్మదిలోన
నేవేళఁ దలఁతుగా కేనేల మఱతు.

వా. అని యాదరించి యక్కీరంబునకుఁ జక్కెరఁ బెట్టించి పట్టించి ఉడిగంపుఁ బడుచులఁ బడకిల్లు సింగారింప నియమించి, తాను మజ్జనభోజనంబులు గావించి, శృంగారరచనల నంగంబుఁ గైసేసె.[1]

తనరాక కెదురుచూచుచున్న కనకాంగి మనోరథంబులు పూరింపఁగోరి రఘునాథశౌరి సమయసముచితశృంగార హారియై యొకవేదండయాన కైదండఁ బూని కుసుమకోదండ దీక్షాగురుండో యనఁ బండువెన్నెలబైట వీటిరాజమార్గంబున వెడలి, కొందఱు చనవరిగుఱిదొర లందందఁ దన ముందు వెనుకఁ గనిపించుకొనక యింతంతట నడవఁ బౌరనారీజార విరహంబులు చూచి నవ్వుచు వచ్చునంట యెటువలెను.

1. గైసేసి.

దరువు......

రమణీయమూర్తియై రాజమార్గమున
రమణియింటికి[1] వచ్చె రఘునాథశౌరి.

వా. ఇవ్విధంబున నవ్వాలుగంటియింటిఁ జేరవచ్చి నిల్వ, నప్పుడప్పుడమిఱేని యడపకత్తె యత్తలోదరి యున్నతసౌధంబుఁ జేరి యేమనుచున్నది.

దరువు......

పాండిత్యవతులైన పాండ్య తుండీర
మండలాధీశకుమారికామణులఁ
గడకంటఁ జూడని కాంతుండు నీదు
పడుకటింటికి రేయిఁ బాదచారమునఁ
దానె వచ్చెనటన్నఁ దరుణీలలామ
నీనోముఫలము వర్ణింపఁదరమె
విమలాంగి నమ్మ భూవిభుఁడు నీసొమ్మ
రమణుని కెదురుగా రమ్మ లే లెమ్మ.

వా. అని యారాకాచంద్రముఖి తెల్ప నతనిరాక విని యారతులు పట్టించుకొని చిత్రరేఖ యాధాత్రీకళత్రుని కెదురుగా వచ్చెనఁట యెటువలెను.

దరువు......

మైత్రితో నారాజమన్మథుని కెదురుగా
చిత్రరేఖ వచ్చెఁ జెలువలు గొలువ.

వా. ఇవ్విధంబున వచ్చి జవ్వని యవ్వనితామన్మథుని యడుగులు కడిగి యారతులెత్తి యారతిపతిమోహనాకారునిఁ జూచి యేమనుచున్నది.

1. రమణయింటికి

పదము-......

స్వామి రారా నానోము లీడేఱె
[illegible]చాల శ్రీరఘునాథభూపాల
భానుని కాఁకలఁ బడలిన చెలువకు
ఆనందముగఁ జంద్రుఁ డరుదెంచినట్లు.

జీనిచక్కెరవింటివాని దుముదారుకు
లోనైన నన్నుఁ గావఁబూని యీవేళ.
వేసవిదినముల వేఁడిమిచేతను
గాసిలు నెమ్మికొమ్మ కరకరి తీర.
వాసిగఁ బర్జన్యుఁడు వచ్చిన తెఱఁగున
ఈసమయంబున నాసొక్కు తీర.

కోరి చేరి పిల్చిన కుబ్జయింటికి నాఁడు
వారిజనాభుండు వచ్చినరీతి.
ఈరాజవీథిలో నిరుగుపొరుగులనున్న
వారు చూడంగ నాయొద్ది కిపొద్దు.

వా. అని యుపచరించిన రమణీమణికేలు కేలం గీలించి రఘునాథభూపాలుండు కేళీభవనంబుఁ బ్రవేశించి, పంచశరకళాప్రపంచంబెఱింగించి యమ్మొఱుంగుఁబోణిని గరంగించి యచ్చటముచ్చట దీరిన మచ్చకంటిని బచ్చవింటిదొరతనంబునకు గుఱిసేసి యేలుచు నిజలీలావిలాసశృంగాటకంబుగా నాటకంబు హావణించిన తనముద్దుపట్టియగు విజయరాఘవపట్టభద్రునకుఁ బట్టంబుఁగట్టి యతఁడు కావించు వివిధోపచారంబులకు హర్షించుచు నమరులు పుష్పవర్షంబు వర్షింప శుభోదర్కంబుగా నటించెనంట యెటువలెను.

రఘునాథాభ్యుదయము
సంపూర్ణము.

---



Rathnam Press, Madras—1.